ఆంధ్రసేవా గ్రంథమండలి,

ఏలూరు.

ద్వితీయ పుష్పము.

# సత్యపాలన

గ్రంథకర్త:

నేతి సుబ్బయ్యశాస్త్రిగారు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు,

మ్యునిసిపల్ హైస్కూలు,

ఏలూరు.

# Anna Dana Samajam, Ellore.

## అన్న, వస్త్ర, వైద్య, విద్యా దాన సమాజము, ఏలూరు.

ఈ సమాజము 1913 సం॥ స్థాపింపబడెను. 1916 సం॥ ప్రభుత్వమువారు స్థలము ధర్మముగ నొసంగిరి. 1920 సం॥ మ॥ రా॥ శ్రీ బొమ్మా రత్నంగారి ద్రవ్యసహాయమున భవనము నిర్మింపబడెను. ఇందు ప్రతిదినము అశక్తులకు అన్నదానము జరుగుచున్నది. ప్రతిసంవత్సరం 15 డిశంబరు 1500 మంది బీదలకు వస్త్రదానము జరుగుచున్నది. వేసవికాలమున 4 మంచినీళ్ళ చలివేంద్రిలు పెట్టబడుచున్నవి. రాత్రి మధుకరం నెలరోజులు జరుగును. ఒకరోజు అన్నదానమునకు రు 60 లు ధర్మమిచ్చిన రు 5 లు వడ్డీతో వారు కోరిన తేదీ బీదలకు అన్నదానము జరుగును. రు 11-8-0 లకు రు 1-0-0 వడ్డీతో వస్త్రదానము జరుగును. శాశ్వతనిధి ధర్మములకు రశీదుతోపాటు పట్టాలను యిచ్చెదరు. ఎల్లరు సహాయపడవలెను.

ఇతర వివరములకు :—

(1) రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారు గారు, (2) కొత్తమాసు సీతారామయ్యగారు, (సోల్ ట్రస్టీలు) (3) పసుమర్తి పురుషోత్తంగారు, (ప్రెసిడెంటు) (4) మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు, (వైస్ ప్రెసిడెంటు) (5) నున్నా గంగరాజుగారు, (వైస్ ప్రెసిడెంటు) (6) కందుల రామయ్యగారు, (శక్రిటరీ).

---

☞ దయచేసి హిందూయువజనసంఘము, గోసంరక్షణసమితి ప్రకటనలు [illegible]— టైటిల్ 3, 4 పేజీలలో చూడుడు.

ఆంధ్రసేవా గ్రంథమండలి,
ఏలూరు.

ద్వితీయ పుష్పము.

# సత్యపాలన

ఏలూరు
పట్టాభి రామా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
1932

# ఆంధ్ర సేవా గ్రంథమండలి, ఏలూరు.

## పోషకులు.

1 మ॥రా॥శ్రీ దివాన్ బహదూర్ మోచర్ల రామచంద్రరావు పంతులుగారు, బి. యే., బి. ఎల్., ఏలూరు.

2 ,, రావుసాహెబు గుత్తా వెంకయ్య చౌదరిగారు, ఏలూరు.

3 ,, Y. జగన్నాథం పంతులుగారు, బి.యే., జాయింటు రిజిస్ట్రారు, ఏలూరు.

4 ,, నండూరు సుబ్బారావుగారు, బి.యే. బి.ఎల్., వకీలు, ఏలూరు.

5 ,, తాళ్ళూరి సుబ్బారావుగారు, ఎఫ్. ఎ యం., తాలూకాబోర్డు మెంబరు, ఏలూరు.

6 ,, A. కృష్ణమాచార్యులుగారు, బి.ఎ., ల్యాండులార్డు, కానుమోలు.

7 ,, కందుల వేంకటేశ్వరరావుగారు, మర్చంటు అండ్ బ్యాంకరు, ఏలూరు.

8 ,, కనిగొళ్ళ శివరాఘవయ్యగారు, మర్చంటు, ఏలూరు.

9 ,, పిశిపాటి శాస్త్రిగారు, ఏలూరు.

10 ,, తమ్మన సత్యవర్ధనమూర్తిగారు, జనరల్ మర్చంటు అండ్ కమీషన్ ఏజెంటు, బెజవాడ.

11 ,, డింగిరిభట్టర్ శేషాచార్యులు అయ్యవార్లంగారు, ఏలూరు.

12 ,, కె. వెంకటరత్నంగారు, క్లార్కు, రామా అండ్ కో, ఏలూరు.

13 ,, కుసుమ్మరి సత్యనారాయణగారు, ల్యాండులార్డు, తంగెళ్ళమూడి.

14 ,, జి. యస్. వల్లభరావుగారు, జిల్లాబోర్డు ఓవర్‌సీయరు, ఏలూరు.

15 ,, ముక్తేవి సీతారామానుజాచార్యులుగారు, పెదముక్తేవి.

# హెచ్చరిక.

ఆంధ్రభాషాభిమానులారా!

మేమీ గ్రంథమండలి నీపురమందు స్థాపించినదాదిగ పెక్కురుసోదరులు మాయందభిమానముంచి చందాదారులుగఁ జేరిరి. వారందఱికిని మావందన శతంబులు. ఇంకను పలువురు చేరవలసియున్నది. ప్రస్తుత ఆర్థిక పరిస్థితుల ననుసరించి జన సామాన్యమున కంతకును అందుబాటునందుండు తలంపుతో గ్రంథములన్నిటి వెలలు బహుస్వల్పముగ నిర్ణయించితిమి. శక్తి కొలఁది భాషాసేవ జేయనున్న మాకాంధ్రభాషాభిమాను లందఱు సర్వవిధములఁ దోడ్పడుదురుగాత.

మాగ్రంథమండలికి రాజపోషకులుగను, పోషకులుగను జేరి తమ విరాళముల నొసంగిన దాతలకు మాకృతజ్ఞతాపూర్వక వందనములు. ఇంకను తమ విరాళముల నొసంగని దాతలీ గ్రంథ స్వీకరణానంతరమేని ఒసంగి మాగ్రంథమండలిని పోషింపఁ బ్రార్థింతుము.

మాయీ గ్రంథముద్రణమున తగు శ్రద్ధ వహించి పని చేయించిన రామా అండ్ కో ప్రొప్రయిటరు మ॥ రా॥ రా॥ శ్రీ ఈదర వెంకయ్య పంతులు గారికిని, వారి ప్రెస్ మేనేజరు ఈదర కృష్ణమూర్తి గారికిని మానమస్కృతులు.

ఆంధ్రసేవా గ్రంథమండలి,
ఏలూరు.
ది 25—3—1932.

ఇట్లు విన్నవించు విధేయుఁడు,
యన్. వి. యస్. ఆచార్య,
సంపాదకుఁడు.

# ఆంధ్రసేవా గ్రంథమండలి, ఏలూరు.

## నిబంధనలు.

1. ఈ గ్రంథమండలికి మహారాజపోషకులుగ జేరువారు శాశ్వతముగ రు 116 లును, రాజపోషకులుగ జేరువారు సంవత్సరమునకు రు 25లును, పోషకులుగ జేరువారు సం॥కు రు 5 లును విరాళముగ ప్రథమముననే యొసంగవలయును.

2. రాజపోషకుల చిత్రపటములు, పోషకుల నామములు ప్రతి గ్రంథమున ముద్రింపఁబడును.

3. రాజపోషకులకును, పోషకులకును గ్రంథము లుచితముగా నీయఁబడును.

4. చందాదారులకు ప్రవేశ చందా రు 0—4—0 లు
చందాదారులకు గ్రంథము 1 కి రు 0—4—0 లు
ఇతరులకు గ్రంథము 1 కి రు 0—6—0 లు
పోస్టేజి ప్రత్యేకము.

5. చందాదారులు తమ చందాలను ప్రథమముననే యొసగవలయును.

6. గ్రంథములు వి. పి. గాఁ బంపబడవు. సొమ్ము ముందుగా మనియార్డరు చేసి పంపినచో గ్రంథములు బుక్కుపోష్టుద్వారాగాని, మా యేజంట్లద్వారాగాని, పంపబడును.

### మా గ్రంథములలో అడ్వరుటైజుమెంటు రేట్లు.

| | నిండుపేజి. | అరపేజి | పావుపేజి. |
|---|---|---|---|
| నెల 1 కి రు | 5—0—0 | 3—0—0 | 2—0—0 |
| 6 నెలలకు | 24—0—0 | 15—0—0 | 9—0—0 |
| సం॥ కు | 40—0—0 | 24—0—0 | 15—0—0 |

ఉత్తర ప్రత్యుత్తరములకు:—

యమ్. వి. యస్. ఆచార్య,
సంపాదకుఁడు,
ఆంధ్రసేవాగ్రంథమండలి,
ఏలూరు.



మహారాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ రావుబహద్దూర్

మోతే గంగరాజు జమీందారుగారు, ఏలూరు.

(ఏలూరు హిందూయువజన సంఘ భవనమునకు రు 50000 యాభైవేల రూపాయలు వెచ్చించి దివ్యభవనము కట్టించి ధర్మముగ నొసంగిన మహాదాతలు, సదరు సంఘ ధర్మకర్తృ సభాధ్యక్షులు, శాశ్వత ధర్మకర్తలు)



మహారాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ మోతే నారాయణరావు జమీందారు

గారు, ఏలూరు.

(ఏలూరు హిందూయువజనసంఘ వైస్ ప్రెసిడెంటు,

సదరు సంఘ శాశ్వత ధర్మకర్తలు.)



మహారాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ మద్దుల రామయ్యగారి కుమారుడు

వెంకట చినరాజుగారు, ఏలూరు.

(ఏలూరు హిందూయువజనసంఘ ధర్మకర్తృ సభాగౌరవకార్యదర్శి,

శాశ్వత ధర్మకర్తలు.)

మ॥రా॥రా॥శ్రీ ఈదర వెంకయ్యపంతులుగారు,
ప్రొప్రయిటరు, రామా అండ్ కో., ఏలూరు.



మహారాజపోషకులు.



మహారాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ నూకల రామస్వామిగారు,
ల్యాండులార్డు, కానుమోలు.



రాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ తవ్వా సత్యనారాయణగారు,
ల్యాండులార్డు, అండ్ డిస్ట్రిక్టు ఏజంటు, ది జూపిటర్
జనరల్ ఇన్సూరెన్సు కంపెనీ లిమిటెడ్,
పశ్చిమగోదావరి జిల్లా, ఏలూరు.



రాజపోషకులు:

మ॥రా॥రా॥శ్రీ కె. భీమేశ్వరరావుగారు,
బి. కాం., జి. డి. ఎ., ఎక్కౌంటెంటు
అండ్ ఆడిటర్, ఏలూరు.



రాజపోషకులు:

మ॥ రా॥రా॥ శ్రీ ప్రొఫెసర్ శేఖరుగారు, ఎ. ఎ.,
ది గ్రేట్ మెస్మరిస్టు, ఏలూరు.



రాజపోషకులు:

మ॥ రా॥రా॥ శ్రీ నందిపాటి వేంకటనరసింహ
రావుగుప్తగారు, మర్చెంటు, బెజవాడ.
(శ్రీ భ్రమరాంబ మల్లేశ్వర ఆంధ్రగ్రంథాలయమునకున్నూ,
బెజవాడ గోపాలకృష్ణ సంఘమునకున్నూ రాజపోషకులు)



రాజపోషకులు:

మ।రా।రా।శ్రీ గద్దె వెంకట్రావు చౌదరి గారు,
ల్యాండులార్డు, అండ్ మున్సిఫ్, తాళ్లమూడి,
ఏలూరు.



రాజపోషకులు:

మ।రా।రా।శ్రీ జి. యల్. రావుగారు,
సన్ ఆఫ్ బాబూరావుగారు,
ఏలూరు.



యన్. వి. యస్. ఆచార్య,
సంపాదకుఁడు,
ఆంధ్రసేవాగ్రంథమండలి,
ఏలూరు.



యన్. వి. యల్. నరశింహాచారి,
బి. ఎ., బి. యి.డి.,
చీఫ్ రిప్రజంటేటివు,
ఆంధ్రసేవాగ్రంథమండలి, ఏలూరు.

## చూడుడు !!

అనుబంధము 1 ............... "నానాటకము"

(తాళ్ళూరి సుబ్బారావుగారు)

అనుబంధము 2 ......... "ఎంతచదువుకుంటేనేం?"

(తాంత్ర వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు)

# సత్యపాలన

అనంత సంపదభిశోభితయగు ననంతామల్లికాభరణాయమానంబగుభరతఖండంబునందు సరయూజలసంవర్ధిత సకలసస్య భాసురంబగు కోసలదేశం బెలమి నలరారుచుండు. అందశేష రిపుజనాభేద్యయగు నయోధ్యాపురంబు కరంబు వెలయుచుండు. అయ్యది మోక్షద్వారంబులగు సప్తపురంబులలో నగ్రగణ్యంబై సూర్యవంశజన్యరాజన్యులచే నలంకృతంబై యుండును. అన్నగరరాజంబునందు నభోమణి కులతిలకంబగు త్రిశంకు మహీపాలుని తనూజాతుండును రాజకులాలంకారుండును వీరవైరిగర్వాంధకార భాస్కరుండు నగు హరిశ్చంద్ర నరేంద్రుండు చక్రవర్తియై రూప యౌవన విలాస సద్గుణంబులం దనకుం దగి మహిళాలలామయగు చంద్రమతిం బరిగ్రహించి యారాజవదనయందు రూపవిజితరాజకీరాశ్యుం డగు లోహితాశ్యుండను తనయునిం బడసి పురందరవైభవంబునం బొంపిరివోవుచుండె. మఱియు నాతండు సత్యకీర్తియను నమాత్యపుంగవునందు సన్యస్త రాజ్యభారుండయి రాజసూయంబు మొదలుగా ననేకయాగంబులు భూరిదక్షిణాకంబులుగా నొనర్చి యర్థిజనులకుం బారిజాతంబయి యఖండభూమండలం బేలుచుండెను.

ఒక్కనాఁ డమరావతీ పురంబున వైజయంతంబున ముప్పది మూఁడుకోటుల దేవతలును మహామునికోటిత్రితయంబును నపరిమితోత్సాహంబునం గొలువ వాచస్పతిం బురస్కరించుకొని పురందరుండు సుధర్మామధ్య పీఠంబునం దాసీనుండయి పేరోలగంబున నున్న వసిష్ఠ వామదేవ పులస్త్యాగస్త్య విశ్వామిత్రాత్రేయ గాలవ కౌండిన్య శాండిల్య గార్గ్యాదులగు ముని తల్లజుల నుల్లంబులుల్లసిల్ల బహూకరించి నమస్కార పూర్వకంబుగా "నోయతిపతులారా! మీయోగదృష్టికి గోచరింపని రహస్యంబు లోకత్రయంబున లేవుకదా! మీరెఱుంగని రాజులుండరని వేఱుగాఁ జెప్పనేల? కావున నీకాలంబున నిక్కంబుగా నాడితప్పని యొక్కచక్కని రాజకంఠీరవుం డెక్కడనేని మీకంటంబడిన నమ్మహానుభావుని నామధేయంబున నాపీనులకు విందుసేయఁ బ్రార్థించుచున్నాఁడ" నని వచింప నమ్మునిపుంగవు లట్టినిత్యసత్యుం డెవ్వఁడా యని కొంత తడవాలోచించుచు నాకసముం జూచుచుండ నిరతిశయసత్వగరిష్ఠుండగు వసిష్ఠుండు చివాలునలేచి నిలువంబడి చిరునగవు మొగము నలంకరింప బృందారనాథుని దిక్కుమొగంబై "యాఖండలా! నీయడిగిన లక్షణంబువాఁ డీకాలంబున మానవాధి నాథుండగు హరిశ్చంద్ర చక్రవర్తియను నాతం డొక్కం డున్నవాఁడు. ఆతండు నిత్యసత్య వ్రతుండగుటయే కాక దేవబ్రాహ్మణ పూజానిరతుండును, నకాండచండాభియాతి దండధరుండును నగు"నని నుడువ సభ్యులగు ముని

పుంగవు లందఱు నమ్మాట కంగీకరించి యూరకుండిరి. విశ్వామిత్రుం డొక్కరుండు మాత్రమందుల కొడంబడని వాఁడై రూపంబుఁ గైకొన్న రోషంబుచందంబున జేవురించిన కనులనుండి నిప్పులురాలఁ బెదవులుంగటంబులునదర నట్టలేచి నిర్జరులను మునులనుఁ గలయంజూచి పురందరుని కెదురై కరంబులు సాచి గర్జితంబునకుం బ్రతిగర్జించు మృగేంద్రంబు ననుకరించుచు నిట్లు చెప్పఁదొడంగె.

"బృందారకులారా! మునీంద్రులారా! ఈ యిందు్రని మోౖల నీయున్న మహామునీంద్రుల కందఱకు నవమానంబు వాటిల్ల ననుపమాన తపఃప్రభావంబున నంబుజాసనుం బ్రతిఘటించి సృష్టికిం బ్రతిసృష్టి యొనర్చిన నేనున్నానని యైన సంకోచింపక యిమ్ముసలి తాపసి తానును దగుదునమ్మాయని నోటికి వచ్చినట్లు విననగాని యఱపు లఱచుచున్నాఁడు. ఇయ్యఱపు లాలకించి యిచటి వారందఱు నవ్వుదురేమో యనియైన ననుమానింపఁగూడదా! పుడమి నెచ్చోటనైన నింత వింత కలదా! మాంసాశనంబున నొడలు పెంచి మదాంధతం గన్నుఁగానక కల్లలాడుటలకెల్ల పుట్టినిండ్లయిన జేండ్లెక్కడ! సాకేతపురాధిపతియఁట సత్యనిష్ఠాగరిష్ఠుఁడఁట. ఈతఁడెఱుంగునఁట. ఆతనికీ తఁడు పురోహితుండగుట నవ్వారిగా బహుమతులందఁగోరి యిట్లు వదరుచుండెనేకాని యాతనిమట్టు యీతని గుట్టు యెవ్వరెఱుంగరు. ఇట్టు ప్రల్లదంబులు విని మముబోటి వారలు సహించి యెట్లూరకుండనగును" అని వసిష్ఠునివంకఁ

దిరిగి "ఓయీ! ముసలితాపసి! ఈయమరేంద్రుఁడు లోకముల లోని యెవరికెంత సారము కలదో యెఱింగినవాఁడే. ఈతని మ్రోల నీ వ్రేలరితనము వన్నెకెక్కునా? ఎక్కనను నీగుట్టు మూలమట్టముగఁ దెలిసిన యీగాధిపట్టి విడిచిపెట్టి యూర కుండునా? జగంబులం బేరుప్రఖ్యాతులం గనిన యీ మహా మునీంద్రులందఱు నియ్యింద్రుని మాట కుత్తరమీఁజాల కూర కుండ నందఱకన్న నీకున్నయున్నతియేడది? ఇప్పుడు నీవన్న మాట సరిపడునదేనా? పయోదధిఘృతశర్కరాపూపాదుల తోడం గూడ శాల్యన్నంబుల మెక్కుచు, సీధుపానమదమత్తు లును, గాంతాయత్తులును దుర్విషయప్రపత్తులును ధర్మవర్జితు లునునై కపటోపాయంబులం బరుల వంచించి ధనసమార్జనంబు సేయురాజులా యాడితప్పనివారు? ఏల నీకీ వ్రేలరి తనము? పరాకున నన్న నంటివిగాని యిప్పుడైనఁ దప్పన కొప్పుకొని క్షమియింప నిమ్మఘవానుని వేడికొను" మని యాక్షేపింప నగాధినందనుం గనుంగొని దండతాడిత భుజంగంబు వడువున రోజుచుఁ గోపమాపఁ జాలని వసిష్ఠుం డిట్టులను "ఓరాచ తాపసీ! హనుమంతుని ముందా కుప్పిగంతులు? ఎంత వయసు వచ్చినను నీ తులువతనంబు మానవైతివి. ఇప్పటికైనను జ్ఞానం బుఁదెచ్చుకొని తుచ్ఛతనం బుజ్జగించు కొనుము. కలకాలం బును నొనన్నది కాదనుటేనా నీబ్రదుకునకు ఫలంబు? తెలిసినవారిలో నొక గొప్పవానిం బేర్కొనుటయుఁ దప్పుల లోనిదేనా? నిర్మలమాణిక్యముతోడ గులకఱాల సరిచేసి

నటుల సామాన్యరాజన్య బ్రువులతో నిత్యసత్యవ్రతుండగు హరిశ్చంద్రునిం బోల్చు టదేటిపోడిమి? సత్యవ్రతుని కుమారుని సత్యము చిరపరిచితులకైనను సారసంగ్రాహకులకుఁ గాని వేరువారికిఁ దెలియఁబోలునె? పద్మసౌరభము మధువ్రతంబుల కేకాని నిత్యసన్నిహితంబులకైనను గప్పలకుం దెలియనగునే? మేరువు తలక్రిందైనను ధరాతలంబు రసాతలం బంటినను, అరుణుఁ డపరగిరి నుదయించినను, అగ్ని చల్లదనంబు నూనినను, సప్తసముద్రములింకినను, హరిశ్చంద్రునోట ననృతంబు రాదనుట ముమ్మాటికిని నిశ్చితంబు" అని యిట్లు ధ్రువంబుగాఁ బలుకు పరమేష్ఠిసూను పలుకుల విని యాజ్యంబువోసిన యగ్నివలె మండిపడి కౌశికుం "డోముదిముని! నీపంతంబు నంతంబు సూతుజుమీ" యన వసిష్ఠుఁ "డోయీ! తాటియాకు చప్పుడులకు కుందేలు బెదరునా? తొలఁగు" మని యీసడింప నిను మడించిన యీసునం గౌశికుం "డిదె చూడుము. నేనెవ్విధం బుననైనం జలపట్టి యారాచపట్టి నట్టి బొంకింతుం జూడు" మనె. వసిష్ఠుఁ"డోయీ! యట్టులైనచో నీదేప్రజ్ఞావిశేషంబు. అప్పార్థివేంద్రుం డాత్మీయసర్వస్వంబుతోడ దారాపుత్రుల నైన విడనాడుంగాని తన నిత్యసత్యంబును వీడనేరఁడు. వీడె నేని నేనప్పుడ బ్రాహ్మణ్యం బుజ్జగించి వారుణీ పూరితంబగు మానవ కపాలంబు కేలంబూని ఖరవాహనుండనై పరేతరాడ్దిశాభిముఖంబుగాఁ బోవువాఁడ" నని శపథంబు వట్టుటయు, గాధేయుండు "నేనా జగజెట్టి నెట్టునేని బొంకింపఁ జేయలేని

యెడ మున్ను తుషారాద్రిపై ఘోరనిష్ఠం జిరకాలం బుండి యొనర్చిన తపంబునకుఁ గలుగు మహాఫలంబులోని సగం బాతనికి దారవోసి పరిపూర్ణ వైభవంబుతో సప్తద్వీపాధిపత్యంబు సంఘటింతు, ననంతరంబునం బదునాలుగు మన్వంతరంబులీ శచీకళత్రు నర్ధాసనంబునఁ జోటునొసంగెద" నని ప్రతిజ్ఞం బూనె. అప్పుడయ్యెడం దోచిన బహుళోత్పాతంబులం బొడగాంచి సుపర్వసార్వభౌముం డత్యంతాశ్చర్యంబు నొంది కొలువు చాలించె. ఉన్న సుపర్వులును నీ విధంబున నైన నా హరిశ్చంద్రుని సత్యనిష్ఠాగరిష్ఠత కాననగుం గదా యని తలపోయుచుఁ దమతమ నిలయంబుల దారిం బట్టిరి. కుంభసంభవ ముఖ్యులగు మునీంద్రు లందఱుం గ్రుక్కుమిక్కునక యథాయథంబుగ నేగిరి. వసిష్ఠుం "ఔరా, కౌశికా! మఱేమియుఁ జెట్టనలుకక హరిశ్చంద్రు నింద్రునర్ధాసనం బెక్కింతు నంటివి. నిను మెచ్చవచ్చు" నని యుల్లసం బాడుచు మెల్లన నిలాతలంబునకుం డిగె. విశ్వామిత్రుండును బింకంబు మీఱఁ ద్రిశంకుసూనుం బొంకించు వెరవుం దలపోయుచు నిజాశ్రయం బాశ్రయించె.

అది వసంతకాలము. వనోపవనంబుల భూరుహలతాగుల్మాదులు వసంతరాజాభిషేకోత్సవమునకు సింగారించుకొనెనా యన లలితపల్లవ పుష్పఫలంబుల విరాజిల్లుచుండెను. వనలక్ష్మీవసంతుల కరగ్రహణకాలము గావున నిలింపులు నిర్మించిన యాకుఁదోరణంబులరీతి నాకపంబునఁ జిలుకలబారు

లెసకమెసఁగె. పంచశరుని మేలుకొలుపు మంగళగీతంబుల
భంగి భృంగసంగీతంబు నింగిఁబర్వె. కుసుమాలంకార శోభిత
లగు సుకుమారుల మేని చందనామల సుగంధలోభంబునం
బోలె మందమారుతంబు లల్లనఁ గిటికీలఁ జొరఁబడి యంతి
పురంబులఁ దిరుగులాడుచుండె. రసాలకిసాలగ్రాస కషాయ
కంఠంబులగు కలకంఠంబుల కూజితంబులాలింప వేడుకలొదవె.
వైదికులధ్వరసంభారసంగ్రహసంరంభులైరి. అట్టితఱి నిరంతర
యజ్ఞదీక్షారతుండగు హరిశ్చంద్రుం డొక యాగం బొనర్చి
యశేషభూసురుల భూరిదానంబులఁ దనుపుచుండె. అయ్యది
కర్ణాకర్ణిగా వినంబడ విశ్వామిత్రుం డదనిదియ యని యెద
నూహించి యతిత్వరితగతి నయోధ్యం బ్రవేశించి యమ్మహీ
భుజునిచే బహూకృతుండయి వచ్చినపని యేమని యడు
గంబడి "రాజకంఠీరవా! కల్పవృక్షంబు దఱిఁజేరి గంజిఁ
గోరునట్లు వదాన్యులలో మున్నున్నఁ దగు నిన్నుం జేరి
కొలఁదికోరికఁ గోరం దలంచితి. అది యెయ్యది యన్న
సకల భూతాంతర్యామియగు నన్నాగకంకణునికిం బ్రీతిగా
నొక్క సవనంబుఁ జేయఁ దడవులంబట్టి సంకల్పించితి. అద్దానికి
వెచ్చంబునకుం బొడవుగల పూరుషుండొక యేనుంగునెక్కి-
నిక్కి యొకరత్నం బాకసంబున కెగమీటిన నెగయునంత
పొడవు వరాలకుప్ప కావలయును. అయ్యది నీకన్న నన్యు
లగు ధరావరులవలన లభింపదని యెంచి నిన్నర్థింపవచ్చితి.
నన్నుం గృతార్థుఁజేయుదువో వ్యర్థుఁజేయుదువో మీఁద నీ

దయ" యని కరంబులు సాచి నిలువంబడిన యారాజమునిం గనుంగొని హరిశ్చంద్రుం "డోమునీంద్రా ! యాగంబు సేయం గోరిన మీయీ యాగమనంబునంజేసి నాయాగంబు సౌభాగ్యం బయ్యెం గృతార్థుండనైతి. నానివాసంబు పావనంబయ్యె. ఈ సప్తతంతుసమయంబున మీబోటి మహనీయుల కీగాంచుట కన్న మేలెయ్యది? మీచిత్తంబువచ్చినంత విత్తంబు నాయత్తంబుగాం జిత్తగింపుడు." అని యతని భాండాగారంబు తనయధీనంబు గావించుటయు నవ్మౌనిచంద్రుండు "ఔరౌరా దాతవన్నను విశ్వవిశ్వంభరానేతవన్నను నీవొక్కరుండవకాక వేరొక్కరుండుండునే" యని తనమనంబు నిండార నుతించి చివాలునలేచి "రాజా ! మదీయసవనం బారంభింప నింకను గడువు కలదు. ఇంతరొక్కం బేనెందు దాచికొందును? అవసరం బగునపుడ వచ్చి పుచ్చుకొనియెద నందాక నీధనాలయంబుననే యుండనిమ్ము. నీకుం జిరాయురారోగ్యంబులు గలుగుంగాత" మని దీవించి పోయివత్తునని యామంత్రణంబు సేసి యథేచ్ఛం జనియె. హరిశ్చంద్రుండును, "ఈరాచతాపసి కడుంగడు ముంగోపి. తానర్థించిన యర్థం బిప్పుడ కొనిపోక నాపైం గొప్పయప్పుం బెట్టిపోయె. నేను నేమియు ననంజాలక యూరకుంటి. మీంద నేమగునో" యని తలంచుచుం బరాకు లేక ప్రొద్దులం బుచ్చుచుండె. అట్లచటనుండి వెడలిన విశ్వామిత్రుం డాక్షత్రియోత్తము నెట్టులేని బొంకించు వెరవూహించి లెక్కకు మిక్కిలిగా నపరిమిత జవసత్వంబులు గల

క్రూరమృగంబులఁ దన తపోమహత్వంబున సృజించి హరి శ్చంద్రుని జనపదంబులపైఁ గాఱియంబెట్ట ననుప నాఘాతుక మృగంబులు పొగరునఁ జెలరేగి పుడమియీనినవడువున నెయ్యెడఁబొడగనినఁ దామయయి దేశంబుసొచ్చి పైరుపంటల నారగించి గొడ్డుగోదలఁ జంపి మెసవి పిన్నపెద్దలఁ దరిమి పరి గొని సర్వంబును బాడుచేసి గగ్గోలుగావింప జనులెల్ల భయ భ్రాంతులై హరిశ్చంద్రనరేంద్రు పాలికిం బోయి పెక్కులు మ్రొక్కులిడి "మహాప్రభూ! దేవర దయాతిశయంబునంజేసి తమదేశవాసులందఱుం బాడిపంటల కిసుమంతయుం గొదువ లేక కూడుగుడ్డలకుం గఱవుగానక బిడ్డలుపాపలు నేపుదీపింప నీనాటిదనుక నేపాటిచేటును గానక సుఖజీవనంబున నున్న వారు. ఇప్పు డిదేమిపాపమోకాని మేరమీరిన వేగబలంబులు గల ఘాతుకమృగంబులు పెల్లురేగి యెల్లయెడం గ్రమ్మి కొని గ్రామంబులం జొచ్చి పవలనక రాత్రియనక గృహారామ క్షేత్రంబులఁ బాడుచేయుచుఁ బ్రజాసంపీడనంబు సేయుచున్న యవి. మాపాలి యేలికవగు నీకు శరణుజొచ్చిన మమ్మారసి యీయనేకంబుల బారిఁ దొలంగంజేయ నవధరింపుడు" అనిన వారి మనవులాలించి భూవల్లభుండు "ప్రజలారా! తల్లడిల్లకుఁ డిదెయెల్లి నేనరుదేరి దుష్టమృగంబులనెల్ల నిర్మూలించి మీయలజడి యుడిపెద" నని సెలవొసంగి మరునాఁడు వరు వాత మేల్కని కాల్యకరణీయంబుల నిర్వర్తించి నానారసో పేతంబుగా నభ్యవహరించి వాటంబగు వేటకుం దగినవేషం

బలవరచుకొని కతిపయులుబ్ధక పరివృతుండయి సతీసుతా
మాత్యులు వెంటరా వల్గత్తురంగంబులం బూన్చిన శతాంగం
బధిరోహించి ప్రాగ్దిగభిముఖంబుగా వెడలి కంటకగ్గంబులగు
నృశంసక సత్వంబుల సత్వంబులఁ దూలించుచుం జనిచని
వేదండగండకపుండరీకహర్యక్షతరక్షుకిరిభల్లుకాది నానామృగ
సంచారలంపటంబులును కాకఘూకశారీకీర కలకంఠ నీలకంఠకికీ
దివిప్రముఖనిఖిలశకున నికరకలకూజిత కోలాహలంబులును
మందార మాకంద చందన కిచుమంద సింధువార శాల్మలీ
ముఖ్యభూరుహసందోహపరీవృతంబులు నగు మహారణ్యంబులు
సొచ్చి యగణ్యంబులగు మృగంబులం బొరిగొనుచుఁ గొంత
ప్రొద్దు మృగయావిహారంబొనరిచి దేశంబు పరిశాంతఘాతుక
మృగసంబాధంబగుడు నగరంబునకు మరలువాఁడై పదవీగ
వేషణంబు సేయుచు దైవాయత్తంబున నరుంధతీమనోహరు
నాశ్రమంబు పొరింప నందుం బ్రవేశించి యమ్మునితల్లజు
పాదపల్లవంబుల కెరగి యాతఁడుపదేశించిన రాజనీతిరహ
స్యంబుల నవధానంబున నిడుకొని తదామంత్రణంబున
నందుండి వెడలి చనుచుండె.

మును లఘుటనఘటనా పటిష్ఠులు. అఖండ తపో
నిష్ఠాగరిష్ఠులు. వారి తపోబలంబునకుం ద్రిమూర్తులును వశం
వదులగుదురు. తలంచినచో సృష్టికిం బ్రతిసృష్టి చేయఁగలరు.
అందు విశ్వామిత్రుని గుఱించి వేరుగాఁ జెప్పవలయునా ?
హరిశ్చంద్రు నరణ్యప్రయాణం బాకలించిన యాతఁడు పద్మ

రాగ శృంగంబులును నింద్రనీలఖురంబులును మరకత వాలంబు గలిగి ముద్దులొలుకు బంగరువన్నె లేడి నొక్కదాని సృజించి యారాజు నెలయించి తేఁబంపెను. అదియు చెంగున నెగసి పడుచు ఘాసాంకురంబుల గ్రసియించుచు బెదరి బెదరి చూచుచుఁ జౌకళించుచు నల్లనల్లన ధరాపరు మ్రోల మెలంగుచుండ దాని యందంబునకు డెందంబున నోటువడిన లోహితాస్యుం డద్దానింబట్టి తనకుం గ్రీడామృగంబుగా నిమ్మని నెమ్మదితోఁ బ్రార్థింప నయ్యవనీధవుండు చిన్నకుమారుని ముద్దు చెల్లింపఁ దలంపిడి దానిం జంపఁ దెంపుసేయక తటిమి పట్టికొనందలంచి వెంటనంట నదియు నిటునటు పరువులిడుచుఁ జేతికిం జిక్కనదివోలె నెడనెడ నిలఁబడుచు డగ్గరినచో దుమిలించుచు వెనుదిరిగి పరికించుచు నతనిం గడుదూర మెలయించుచు కొని పోయిపోయి కౌశికుని యాశ్రమ ప్రాంతంబున నంతర్ధానంబు నొందె.

నరేంద్రుండును దానిపోయిన వలనుఁ గనుంగొనఁ జాలక నిర్వేరయుం బట్టుదలయు మనంబునఁ బెనంగొన వనంబున నద్దానిజాడ నెమకుచుం గొంతదవ్వరిగి యట నొక్క తాపసాశ్రమంబు గానరా నచట మార్గాయాసం బపనయించు కొనఁ దలంచి సపుత్రకళత్రంబుగా శతాంగావరోహణం బాచరించి తన్ననుసరించి తురగారూఢుండై వచ్చిన దండనాయకుండు కైదండనిడ నాతనితో నప్పుణ్యాశ్రమ రామణీయకముం గుఱిచి ముచ్చటించుచుం జొచ్చి యందు పగలు

వేవెలుఁగుల దొరబారికి వెరపుఁజెందిన యిరుల కభయం
బొసంగి మనిచెడునో యన నెండపొడఁ గానరానీని గుబురు
టాకుల మ్రాకుల జొకుమీరిన తీరంబులును, తీరంబుల
నొరయు వారిపూరంబుల తరగల నెగయు తుంపురులతో
గూడిన కమ్మతెమ్మెరల తాకుడున మెరయు నరవిరుల
చొప్పు ననుకూల జాడల, తాకుడుంగంబులునుఁ బిసకిసల
యాహారంబులఁ బరిపుష్టినొంది మరియు మ రా ళ ం బు ల
కుయాలలగు నలలును, వికచకమలంబులం దొరంగు మరంద
ముల నాని మదించి యాకసంబునఁ బల్లటీల్గొట్టు రోలంబకదంబ
కంబుల ఝుంకారంబులును, జంటలెడఁబాయక పెంటికూఁత
లకు మాఱు గూయు జలవిహంగమంబుల కలకలంబును
గలిగి చెలువలరు నొక్క జలాశయంబు గానఁబడ నొడలి
వడఁదీర నొడయం డందఱుంగూడి యందుం గృతావగాహుం
డయి తీరోపాంతంబున నల్లిబిల్లిగ నల్లుకొని హాయినిడు
నొక్కలతాకాయమానం బునీడనుండిన చలువఱాపలకపయిం
జంద్రమతి యంకతలంబు తలగాడగా శయనించి కొంచెము
నిదురించి పేరోలగంబునం గొలువుదీరి సింహాసనంబునం
గూర్చున్న తన్ను నొకచండముని క్రిందఁబడంద్రోచి సవ్య
పాదంబు సారించి కిరీటంబు డుల్లిపడఁ దాఁచినట్లుల దుస్స్వప్న
ముంగాంచి త్రుళ్ళిపడి లేచి పలవరింపఁ జంద్రమతియుఁ
దత్తరంబుఁజెంది కొంతవడికిఁ దేరి యప్పటికిం దగినమాటల
నతని కలవరంబు డిందుపఱచి యందులకుం గతంబడిగి తెలిసి

యుండుండ నేమికీడు మూడునో తడయక వెడలుదమని నుడువుచుండునంతయు హరాంతకారియగు విశ్వామిత్రుని పంపున నిరువురు మాలెతలరుదెంచి యాటపాటల మెప్పువడసి వేళాకోళంబు లాడరా నారాజచంద్రుండు దరియరాని యా రాజవదనల యాగడంబు సైపనోపక కశాఘాతంబుల నడపించి తఱిమించె. ఆసవ్వడిం దెలిసికొని కౌశికముని దండతాడిత మహోరగంబు పోలిక రోజుచు నరుదెంచి వందనంబాచరించు హరిశ్చంద్రుని కిరీటంబూడి నేలంబడ నెడమకాలం దన్నె. భూపతియుఁ బౌరుషం బుజ్జగించి వినయవినమితశిరస్కుండయి "యయ్యా! దాసునితప్పు దండముతోఁ బోవును" అనుచు నమ్మునితల్లజుని పదపల్లవంబులం బడి లేవకున్నఁ బ్రసన్నత వెలికిఁ గానంబడ నాతండు "మనఁదలంపు నీకుంగలదేని నాముద్దుముద్దియల నడఁచినందులకుం బ్రాయశ్చిత్తంబుగా వారిం బరిణయంబాడుము" అనుటయుఁ జెవులుమూసికొని హరిశ్చంద్రుండు "శివశివా! యెంతమాట వింటిని. పాపము శాంతించుఁగాత" మని విశ్వామిత్రుంజూచి "యయ్యా! యిట్టి దోసంపుటూసులాడి కాఱియం బెట్టుటకన్న నాయసువులం గొంటిరేనిఁ గడుంగడు మేలు. తమకుం గావలసినచో నాసామ్రాజ్యంబునైనం గైకొనుండు గాని యీదోసంపు భారము నాపైఁ బెట్టకుఁడు. కులశీలంబులు విడువఁజాల" నని జాలివుట్టం బలికిన నదియె నెపంబుగాఁ గొని ధూర్తుండగు నమ్ముని "విశ్వంభరారమణా! సూర్యవంశ సంభవుండవగు

నీవాడినమాటఁ దప్పరాదు సుమీ ! వేణీవిజితనీల నీరద లగు నాదారికలనొల్లక సామ్రాజ్యంబు నొసంగెదనంటివికదా? ఏది చూతము. నీరాజ్యమంతయునిపుడనాకు దారవోయుము" అనుచునిర్బంధంబుసేయఁజంద్రమతియు నింతకన్న మనకుం గా వలసినదేది యని హెచ్చరింప యిలాపతి తన సామ్రాజ్యంబు నమ్మునికి ధారాదత్తంబుసేసి సపుత్రకళత్ర పరిజనుండయి పురంబున కరిగి యవ్వార్త నాగరకులకును జానపదులకును నాబాలగోపాలంబుగా నెఱుకపఱచిన వారందఱు "నోయే లికా! మాపాలి దైవంబవై యింతకాలముం గన్నబిడ్డలవలెఁ గాపాడి నేఁడా కటికిరాచతాపసి బారి కప్పగించి వెడలిపోవ న్యాయంబగునే" యనుచు నాక్రోశింప వారిం దగు సమా ధానంబుల నొప్పించి యాలుబిడ్డలు వెంటరాఁ గట్టుబట్టలతోఁ నరణ్యంబునకుం బయనంబయ్యె.

అప్పుడు విశ్వామిత్రుం డుట్టిపడి యాతనిం జూచి "రాజా ! అల్లనాఁడు నాకిచ్చెదనంటివే యావిత్తంబు నాకుం జెల్లింపక యెటకో పోవం జూచెదు. ఇది యాడితప్పని పాడి యేనా" యని పరుషంబుగాఁ బలికి యదియు నెల్లేని సంపా దించి యర్పింతునన్న "నిన్ను నమ్మువారెవ్వ" రని కపట విద్యలోఁ దనకన్న నేఁడాకు లెక్కువ చదివిన నక్షత్రకుండను నమ్మిన శిష్యు నతనిపైఁ దరుఫుకానిఁగా నంపి యదృశ్యుండయి యా యినకులతిలకుని వెన్నాడి యడవులలోఁ గడునిడుమలం బెట్టియు తుద కాలుబిడ్డల నమ్మించియు మాలవాని కాతనిఁ

దాసునిఁగా విక్రయించియుఁ దక్షకుని నోటికాటున లోహి తాస్యు నసువు లెడలించియు రాచనిసువుం జంపెనని చంద్ర మతిపై నిందఁ జెందించియు నాతనికి సతీకంఠలుంఠనంబు సంఘ టించియు బొంకింపఁజాలక సత్యవ్రతసుతుని కట్టెదుటఁ గానం బడి సత్యనిత్యతకుం గడుంగడు మెచ్చుకొని యచ్చోటునకు వచ్చిన హరిహర హిరణ్యగర్భులతోడం దనచేసిన పంతంబును పఱచిన పాటులను దెలియఁజెప్పి వారి యనుగ్రహంబున లోహితాస్యుం బునర్జీవితుంగా నొనరించి సుదర్శనం బాతని యానతిఁ గైకొనునట్లు మాధవు ననుమతింపఁజేసి కృపా పూరితాంతరంగుండగు నక్కౌశికుండు "వత్సా! నీ సత్యంబు నిత్యంబుగా నొనరింపఁ దలంపున నీకుం గావించిన కష్టంబులనుల్లంబున నురచి మన్నింపుము. నీకీర్తి యాచంద్ర తారంబుగా వర్ధిల్లుఁగాత. నేనెంతయుఁ జలపట్టియు నీచే నసత్యం బాడింప లేనైతినేని నిన్ను నేను దివ్రులకు నేకఛత్రాధిపతిం జేయుదునని యింద్రసభలోనం బ్రతిన యొనర్చితిని. అందు లకుం దగిన మహామహిమ యిపుడ నీయం దావహింపఁ జేయుదు" నని తాఁ జిరకాలం బొనర్చిన తపంబునకుం గల ఫలంబులోని సగం బాధరణీశ్వరునకు ధారాపూర్వకంబుగా నొసంగి "యికముందు చక్రవాళపలయిత మహీవలయమం తయు నేలుచుఁ జక్రంబు నీపనుపుసేయ ననంతభోగంబు లను భవింపు" మని దీవించి యంతకుఁ బూర్వ మయోధ్యాపాల నంబునకుం జాలించియుంచిన సుయజ్ఞు నుద్దేశించి, "ప్రియాం

తేవాసీ! హరిశ్చంద్ర నరేంద్రునకు నాతని సామ్రాజ్య మంత యుం బ్రత్యర్పణంబు గావించితిమి. ధన కనక ధాన్య వస్తు వాహనాదుల నెల్ల వేర్వేర వివరంబుగా నీతనికప్పగించి నీ యాధిపత్యంబున నాయువ్యయంబులు లెక్క చెప్పిరమ్ము" అను చుం బత్రిక లిఖించి హస్తాక్షరముద్రితంబుఁ జేసి యయ్యుర్వీ శర్వరీశుమ్రోలంబెట్టి "దీనింగొని సుయజ్ఞున కిప్పించి యతనిచే నీసామ్రాజ్యం బిప్పించుకొను"మని పునఃపునరాశీః పూర్వ కంబుగా నంపకంబుసేయ నయ్యవనీధవుం డాకమ్మసమ్మతిం గైకొని విశ్వామిత్రుల వీడ్కొని యన్నపూర్ణాసనాథుం డగు విశ్వనాథుచరణకమలంబుల కెరఁగి సపుత్రకళత్రుండయి వారణాసి నిర్గమించు సమయంబున నంతవృత్తాంతంబు వేగు వారివలన నాలించిన కాశీరాజు తన బలంబుతోడ నన్నేల యేలికం గానవచ్చి "చక్రవర్తీ! తామివ్విధంబునం బాదచారు లరై పోవంజూచి యూరకుండుట మాబోంట్లకు ధర్మంబు కాదు. ఈనాఁడు నామందిరముం బావనంబుఁగా నొనర్చి నాకుం గలిగినకొలంది విందారగించి ధన్యుంజేసి యెల్లి రేప కడఁ బయనంబై చతురంగ బలంబులు గొలువ నధికవిభ వంబున విజయంబుసేయఁ జిత్తగింపు"డని వినయపూర్వకం బుగాఁ బ్రార్థింప నయ్యానందవనాధీశుని పలుకు గారవించి యానాటి నక్కాశియందే కడపి యాతేనికోరికం దీరిచి మరు సటినాఁ డుదయంబునం గడలేని సేనలు పరివేష్టింపఁ గాశీనా థుండగ్రయాయిగా దారిసూపుచు నడువ, సర్వమంగళా

కుమారసహితుండయిన తుహినగిరిజామాత చందంబునఁ జంద్ర
మతీ లోహితాస్య సహితుండయి బంగారులేడెక్కి వెడలి
యెడనెడఁ గానుకలంగొని కానవచ్చు నరనాథుల నారదమేను
రోక్తుల గారవించుచు యథాసుఖయానంబునం గొన్ని
నాళ్ళలోఁ దనదేశంబు దరియం జేర నయ్యుదంతంబు యథా
ర్థ్యాలవలన వినిన సత్యకీర్తి సుయజ్ఞు ననుమతిం బడసి "సత్య
సంప్రీణిత కౌశికుండగు మన సత్యహరిశ్చంద్ర సార్వభౌముండు
మన పుణ్యవశంబున మరల నేలనేలువాఁడై దయచేయు
చున్నాఁడు. పురవాసు లందఱా భూపురందరు నెదురుకొనం
జనుఁడు. సాకేతని కేతనంబు లలంకరింపుఁడు. తోరణంబులఁ
దోరణంబులు గట్టింపుఁడు. రాజమార్గంబుల మృగమద
కలితంబులగు జలంబులం జల్లి ముత్తియంపు ముగ్గులిడి యెడ
నెడఁ బతాకంబులు నిలుపుఁడు. మఱియు నగరుపొగల
బుగులు కొలుపుఁడు. గొలలతోడంగూడిన యరఁటికంబులఁ
బచ్చియాకుపందిరుల నలవరింపుఁడు" అనుచుం బురంబునఁ
జాటంబనిచె. అంత నంతయుం దెలిసిన సుయజ్ఞుండును సంతో
షభరితుండయి సత్యకీర్తి ప్రముఖ ముఖ్యామాత్య పురస్స
రంబుగాఁ బౌరులలంకృతులై తనతోడ నేతేరఁ దీరని యాద
రంబున హరిశ్చంద్రునకు నెదురుగాఁజని తన్నుంజూచి నంతనె
దూరంబున రథంబుడిగ్గి వినయవినమిత గాత్రుండై నమస్క
రించిన యాతనిఁ గడుంగడు గారవించి వేదోక్తంబు
లగు సూక్తుల నాశీర్వదించి "సార్వభౌమా! గాధేయు

మోని కల్పితంబులగు మాయావారి వాహపటలంబుల శాంతిప్రచండ మారుతంబునం దూలించి వాసిఁగాంచిన నిన్నుం గాంచుటవలన మాకన్నులపుణ్యంబు సఫలంబయ్యె. మాజన్మంబు ధన్యంబయ్యె. నీచరిత్రంబున నిముడుటం జేసి నాపేరు పేరుఁగాంచె" నని కొనియాడం జొచ్చిన నమ్ముని శిష్యునితో "నయ్యా! గురులకుం గురువైన మీగురుని గురుతరానుగ్రహంబున నేకదా యింతకు రాఁగలిగితిని. ఆదయాళుండు ప్రసన్నతంజూచినఁ బడయరాని దెయ్యది?" యన సుయజ్ఞుండు "నిజము మిముఁబోటి శాంతిమంతు లితరులొనరించు నపకారంబుల నుపకారంబులుగా భావించుటంబట్టి మాగురులు కరుణాపరులే యగుదురు. చిరకాలంబు ఘోరనిష్ఠలంబూని పూని శతోఁ దపంబుసేసి యుపార్జించిన పుణ్యఫలంబు వీసరవోనీసుఁ గొని మిమ్ము గొలగాని కాటియలం బెట్టిన మాగురుల కిహపరంబు నిందయేకాని యొండేమి లాభము లభించెను? మీ కన్ననో సత్యసంధులని యుభయలోకంబుల విఖ్యాతిలభించె. బంగారు గుంపటింబెట్టి కాల్చిన యగసాలికి భస్మధూమంబులును, బంగారమునకు వన్నెయుఁ గలుగుంగాదె? కావున మీ వలని గౌరవంబ మాకెప్పుడును గోరందగియున్నయది" యనుచుం గొనియాడుచుండ నంతకుము న్నాదేశింపఁబడిన మావటిచే నానీతంబయిన మహామేఘసంకాశంబగు పట్టంపుటేనుగు మహాభాగు నెదుట నిలువంబడె. సుయజ్ఞప్రార్థన ననుసరించి యాభూపురందరు ష్వభవాహనం బధిరోహించు సంక్రందను

రీతి సగ్గంధగజంబు నెక్కి తనవెంట మేరుసంకాశంబగు భూరిమయరథంబున సతీసుతులే తేరఁ బంచమహావాద్యంబుల్ము మ్రోయ నయోధ్యకుం జని గోపురంబు దాటి రాజ పథంబునం జనునప్పు డప్పురంబునంగల మేడలపై జేడెలు గుమిగూడి యాతేనిపొడిమిఁ గనుఁగొనుచు నొండొరులం జేరంజీరు కలకలంబు లొలయ "నోకలికీ! చూఁడవే ప్రతినపట్టి చలపట్టి యిక్కట్టులం బెట్టు గాధిపట్టి శాంబరీజాలంబులఁ జిక్కు వడక పెంపెక్కిన వాఁడును, జగంబుల నేరికిం దశంబుగాని సత్యవ్రతంబు సాగించుపొంకపు నాలుబిడ్డల నమ్మియుఁ దా మాలనికి దాసుండయ్యు వీసపోని వాసిఁగాంచి త్రిమూర్తుల మన్ననం గొన్న వాఁడును, జయంతవసంతుల మించు సోయ గంబు గలవాఁడును, మనయేలికయు నగు హరిశ్చంద్రనరేం ద్రుఁడదె పట్టంపుటేనుంగు నెక్కి వచ్చుచున్నాఁడు. ఓతలోదరి!. యాతనిమాటకేమికాని యాచెంతం బంగరుతేరిపై నున్న యన్నులమిన్నం జూడవే! లోకములోని పతివ్రతల కిట్లు నేర్చు కొనుఁడని యుపదేశించెడునో యనఁ దననాథుని యపాయంబు దప్పింపఁ గాలుచిచ్చునం బడుండి తోరివ చూపెనఁట, మగనియప్పుఁ దీర్ప దాసిగా దానమ్ముడువోయెనఁట, ఇట్టి సతీమణు లీవసుమతీతలంబునం గలరని కని విని యుంటిమే? అక్కలారా! అదేమి యమ్మక్కగాని యాకొమ్మకు ముం దున్న చిన్ని వన్నెలానిం జూడరే! పాపమీ పాపఁడు పాఁప తేనికాటువడి చచ్చి బ్రతికెనఁట. ఇమ్ముద్దుబిడ్డనిం గననోచిన

యమ్మయగు నమ్ముద్దుగుమ్మ యదృష్టం బేమనవచ్చునమ్మా అక్కమారు నొక్కముద్దిడుకొన్నం జాలదే! ఇట్టి సుగుణాల ప్రోవుల నిట్టి కరుణాలవాలుర నిట్టియందాలగనుల గన్నులం గానఁగలిగిన మనభాగ్య మేపాటిదో కదా!" యని ముచ్చటించు కొనుచుం బచ్చవిలుతుంబోలిన యాతనిపై దేవతలు గురి యించు పుష్పవర్షంబునకుం జతగాఁ గుసుమవిసరంబులఁ జల్లు చుండ, వారముఖ్యలగీతంబులును, భేరీపటహనిస్సాణాది మం గళవాద్య నాదంబులును, స్వస్తివాచనిక భూసురాశీర్వాద నాదంబులును, బట్టువారల సాహోనినాదంబులును, సామం తుల ప్రశంసారావంబులును, నేకీభవించి నాకంబుతాకుచుండ, ధరామరచిరంటులొసంగు బంగారుపళ్ళెరంబులఁ గపురంపు మంగళహారతులఁ గన్నుల నద్దుకొనుచుం జక్రవర్తి యల్లనఁ గోటవాకిట నేనుంగు డిగ్గి ప్రెగ్గడలు కైదండయొసంగఁ గొలువు కూటంబుం బ్రవేశించి దర్శనలాలసులయి వచ్చిన పౌర జానపదజనుల నుచిత సత్కార సంతుష్టులఁజేసి వీడుకో లిడి యనంతరంబ భోజనశాలకేగి యందంతికుమున్న సుయజ్ఞ నాజ్ఞ నాయితంబు గావింపఁబడియున్న షడ్రసోపేత మృష్టా న్నంబులఁ గాశీశుండు మొదలుగాఁ గల యాప్తవారం బుతో నారగించి పదంపడి నిఖిలోపకరణ శోభితంబగు పడకిం టింజేరి పరిచారికలుసేయు రాజోపచారంబు లంగీకార పూర్వ కంబుగా బహూకరించుచుఁ దల్పరాజంబున నల్పేతరంబగు సుఖంబున నిద్రించె. కాశికావల్లభుఁడాదిగా నాప్తులా సుయ

జ్ఞుఁడు చూపిన మందిరంబులం బ్రసుప్తులైరి. మరునాటి యుద యంబున మంగళ సంగీత వాద్యనాదంబుల మోదంబుతో మేలుకొని యారాజకంఠీరవుండు తనకన్న మున్నలేచి కాల్య కరణీయంబులం దీర్చి తన కట్టెదుర నిందిరాదేవిం బోలి నిలు వంబడు తనముద్దుగుమ్మ నెమ్మొగమ్ము సమ్మతిం గనుంగొనుచు శయనాగారంబు వెలువడి వేవేగ వేకువ పను లొనరించుకొని పాత్రిస్మరణం బాచరించి పెద్దలకుఁ దద్దయు వందనంబు లిడి. నిర్ణేజక నిర్ణేజితంబులగు స్వర్ణాంబరంబులం దొడిగి మహార్హా లంకరణాలంకృతుండయి పాదత్రాణ తనుత్రాణ శిరస్త్రాణం బులఁ దొడిగి తాంబూల కరండవాహిం చు లొసంగు దొంత విడెంబు లంగీకరించుచు నల్లనఁగంకణక్వణనంబులొలయ నంద గత్తియలు వీచోపులిడఁ బసిడి బెత్తంబుల హెగ్గడికత్తె యలు కైవారంబుల దైవార వంతిపురినుండి బయలుదేరి చలువఱాలఁ జెలువలరు కొలువునెలవునకుం జని యంతకు ముందేవచ్చి తనకై వేచియున్న సుయజ్ఞుం డెదురుగా నేతెంచి గౌరవింప నాతని విష్టరంబున నుపవిష్టుంగావించి నానారత్న విచిత్రితంబయి వెలుఁగొందు సింహాసనంబునం దానాసీనుం డయి నానారాజకుమారులును సామంతమంత్రిపురోహితు లును, వివిధవిద్యా ప్రవీణులగు విద్వాంసులును, కవిగాయక నటకహాస్యకులును, ననవద్యులగు నుద్యోగులును, కృత కృత్యులగు భృత్యులును, పౌర జానపద జనులును మొదలు గాఁగల సభాస్తారులు పరివేష్టించి సేవింపఁ గొలువుండె. అంత

ననంతవినయ సంభ్రమంబులు పెనఁగొన సత్యకీర్తి యోరగా నిలువంబడి "మహాప్రభూ! మేమెంత పుణ్యంబు చేసితిమో కలకలలాడు కొలువుకూటంబున దేవర మఱల భద్రాసనా సీనులైయుండం గనుపండువుగాఁ జూడగంటిమి. ఇప్పుడుకదా మిమాకోరిక లీరికలెత్తగంటిమి. ధన్యులమై మనగంటిగాధేయ మునిబాధలఁ బెట్టిననుఁ గొంచెమైనం గోపింపని మీచరిత్రంబు నాదర్శకముగాఁ గొనఁగంటి" మనుచుండ హరిశ్చంద్రుండు "అమాత్యపుంగవా! కౌశికముని నన్నుంగష్టపెట్టెనని నిష్ఠురంబు లాడుటది కూడని పని. ఎవ్వరికేనిం బురాకృతం బనుభవింపక తీఱదుకదా! కష్టసుఖంబులందు ఖేదమోదంబులందుట ప్రాకృతులకుం గాని ప్రాజ్ఞులకుం గాదు. ఆమహాత్ముఁ డేమియొనర్చి నను నామేలుకొఱకే కాని, వెఱొండు కాదు. చెక్కుచెదరకట్టి పాలుదాల్చించిన మేలెవనికగును? మహనీయుం డామునిని మన పాల దైవంబను మాట మఱవఁదగనిది" అని యాతని సమాధానపఱచి కూర్చుండ నియోగించి మించిన వేడుకతోఁ దనకుం గౌశికనందనుండు వ్రాసియిచ్చిన పత్రికం బదిలంబుగాఁ దెప్పించి సుయజ్ఞున కిప్పింప నతఁడద్దాని వినయంబునం గైకొని కన్నులనద్దుకొని కౌతుకాయత్త చిత్తంబుతోఁ జదువుకొని చిరునగవు తళుకొత్త "రాజకంఠీరవా! తామీరేక నాకీ నవసరమే లేదు. ఇంతకుమునుపే నేఁజేయవలసిన పనులన్నియు మాగురులు నాకుం దెలియనంపిరి. మీసొత్తు మీ కిచ్చుటలో సంశయ మే మున్నది? ఇదిగో మీ సర్వస్వమ్మును మీ కాయ

త్తంబుఁ జేసెద. లోటుపాటులున్న మన్నింపవలయును. మీ
సామ్రాజ్యంబు మాయధీనమైనది మొదలిప్పటివరకు నా
యవ్యయంబు లీపత్త్రంబున వ్రాయంబడినవి. సావధానంబునఁ
జిత్తగింపుఁడు" అని యిట్లు చదువం దొడంగె. "ధర్మాదాయ
బ్రహ్మాదాయ దేవాదాయంబులుగాక మిగిలిన యాదాయంబుల
వలన సమకూడినరొక్కంబు వరాలుమున్నూఱుకోట్లు, సామం
తులవలనరాఁబడినూఱుకోట్లు, కానుకలవలనివచ్చుబడి పదికోట్లు
ఇందు హరిహరాదిదేవతోత్సవాదులకును నన్నసత్రంబులకును
గజతురగాదివాహనంబుల యాహారంబులకును నుద్యోగుల
వేతనంబులకును వెచ్చంబు పదునేనుకోట్లు. తక్కంగల
యర్థంబును మునుపటి మీయేలుబడిం బోగుపడిన పైకంబును
బొక్కసంబున యున్నది. పొరబాటులున్న మన్నించునది.
వైదికంబు నేర్చిన మాబోటు లొనర్చిన రాజ్యకార్యంబుల
లోపంబులుండుట సాజంబ. అట్టి వానినెల్లఁ జక్కం జేసి
కొందురుగాత" మని సర్వంబును హరిశ్చంద్రుని కప్పగింప
నాతండు నంతయు నెంతయు సంతసంబని సమ్మతించి గురునికడ
కరుగంబోవు నాసుయజ్ఞుం బ్రార్థించి కొన్నినాళ్ళు నిజనివా
సంబున నిలుచునట్లొడంబరచె. అంతఁ గొంతవడికిఁ బరిచార
కులును నాగరకులును మొదలగు కొందఱా భూపురందరు
దరిఁ జేరి కౌశికశిష్యునిం గనుంగొని పరిభ్రాంతులై నతులొనర్చి
తరువాత భూమీశునిపాదరాజీవంబుల నొరఁగి "తండ్రీ! యేమం
దుము. చంద్రదర్శనంబులేని యామినియుందుం బోలె భవద్వి

రహితంబై చెన్నుఁదొలంగిన యీదేశంబునం దిన్నినాళ్ళును బసచెడి తల్లిఁగానని లేఁదూడల చందంబున మలమల మఱుగుచుండ నకృతజ్ఞుండగు నీసుయజ్ఞుండు దేవోత్సవంబుల కనియు సంతర్పణంబులకనియు నధ్వరంబులకనియు వెట్టికింగొట్టిమోయరాని భారంబుల మోయింప నొదలలుం బుజంబులుంగాయలు కాచినవివె చూడుము. మాకష్టంబు లేనాఁడు గట్టెక్కునాయని చంద్రునికిం జకోరకంబులుంబోలె వేచియుండ మాయదృష్టవశంబున నీనాఁటికి మాకోరిక లీరికలెత్త మిమ్ముం గనుంగొనం గలిగితిమి. సుఖంబున జీవింపఁగలిగితిమి " అనుచుం దీనాననులై మనంబులం గల యుడుకంతయు వెడలింపవారివిన్నపంబుల తేఁటాదరించి విఁంచిన కనికరంబున డెందంబు కఱుగ మందస్మిత సుందరవదనారవిందుండగుచు "నా ప్రజలారా! వందనీయుండగు నీభూసురగ్రామణి యానతిం దలమోచి సుకృతకార్యంబులం గష్టపడి సాయంబుచేయుటవలనఁ బుణ్యఫలభాగంబు మీకునుం గలదు గాన నింకేమియు ననఁబోక మీనిలయంబులం బొండు" అని వారలకుం దగిన సత్కారంబులు గావించి యనిపింప, వారును రాజునకుంగల దొరపునకును, దమయందుంగలయనుకంపావిశేషంబునకును నానందించుచు స్వస్థచిత్తులై తమతమ నెలవులకరిగిరి. ధరాపాలుండును నిరాఘాటముగా సుదర్శనంబు తనకు సాహ్యాపడుచుండ ననంతానంతావాలకిరీటఘటితమణిగణనీరాజితపాదరాజీవుండయి తనపాలనంబున కాబాలగోపాల మభినందింపఁ

దొల్లింటియటుల నీతిబాధారహితంబుగ దేశపాలనంబునకుం గడంగె. కతిపయవాసరంబులుగడువ నొక్క నాఁడు మునిపతి యగు నరుంధతీపతి యవ్వసుమతీపతిం జూడరాఁగా నతం డాతనిదవ్వులం గని యెదురేగి నయభయంబులతో నమస్క రించి యాశీర్వదింపఁబడి తోడితెచ్చి యుచితాసనాసీనుం జేసి ప్రసన్నుఁడగు నమ్మునితో "గురువర్యా! కుశలమా?" యన నమ్ముని యపరిమితానందమంది పునరాశీర్వాదంబు గావించి "నీయంత యంతేవాసి నాసితప్పక పంతంబుసాగించుచుండ మాకుం గుశలంబున కేమికొఱంత? విశ్వమిత్రుండగు విశ్వామిత్రునంతవాని నిత్యసత్యపాలనంబున మెప్పించితివి. నాపంతంబు చెల్లించి ధన్యతముం జేసితివి. దానంగదా నాతపః ఫలముం గానంగలిగితిని. విరించిం బ్రతిఘటించి పొగడికం బొందిన విశ్వామిత్రుని మెప్పింప నీవకాక యేరితరంబు. నీకీర్తి నిఖిలజగంబులం బ్రసిద్ధిఁజెందుట కమ్మునిముఖ్యుని పట్టుదలయ మూలాధారంబు" అని పలుకు నగ్గురుని కలికిపలుకులకుం గడునలరి యిలాపతి "తాము సెలవిచ్చినటుల గౌశిక మునీం ద్రుఁడే నాపాలిదైవము. ప్రశ్రితులకు సకలాభీప్సితంబు లొసంగ సమర్థుండగు నాయన యనుగ్రహంబునను తమపరి గ్రహంబునను నేనింతకు ధన్యుండనైతిని" అనుచు విజ్ఞాపనంబు సేయుచుండ సాక్షాత్కరించిన రాజ్యలక్ష్మియనందగి చెలు వలరు చంద్రమతి యల్లనల్లన వచ్చి గురుతల్పజుని పదపల్ల వంబులకెరగి కృతమంగళాశీర్వాదంబులు త్వరితగతిం బ్రాణేశు

వెనుకకుంజని యాతనిపాదంబులఁ జూపునిలిపి నిలువంబడియె. అప్పు డప్పురమేష్ఠి సుతుం డక్కడి సుయజ్ఞున కయ్యమంజూపి "యోపుణ్యాత్మా! ఈ మహిళాలలామ తనమేలితాలిమిచే నేల బాలికం దూలించె. ఈమె యీాలువతనంబెన్న సహస్రముఖుం డగు నాదిశేషునికైనఁ దరంబుకాదు. అద్దానిందేపగాఁ గొనియే కదా యీాపుడమిఱేఁ డాపదాపదంబుల తీరంబుల జేరంగలిగె. పాపమీాపె పాపనికై పరితాపపడెనట" అనుచుండ నడ్డంబు వచ్చి సుయజ్ఞుఁడు "అయ్యా! ఈ జాయాపతు లతులితకీర్తిమంతులగుటకుఁ దావలంబు భవత్పదావలంబమేకాదా! మీాయనుగ్రహంబునకుం బాత్రులగువారలు విశ్వామిత్రుని మాయాజాలంబులఁ దూలించు టదెంతవింత? మిమ్ము నమ్మినవారికెన్నండును శుభంబులొనఁగూడు"నని కొనియాడుచుండ సత్యకీర్తి వసిష్ఠుంజూచి "వాచంయమేంద్రా! మీామాటలకడ్డు వచ్చితిని. నామనంబున నొక్కసందియము కలదు. అయ్యదితీర్పఁ దామే సమర్థులు కావున నుత్తరమనుగ్రహించి యానందింపఁ జేయఁ బ్రార్థించుచున్నాను." అనవిని వసిష్ఠుండు "మంత్రిపుంగవా! నీమనసునఁగల సందియమేదియో సందియఁపడక తెలుపుము. నాకుందెలిసినంత తెలుపఁగలవాఁడ" ననుటయు సత్యకీర్తి "గురువరేణ్యా! సత్యవాక్యధురంధరుండును, మూర్తిత్రయాదరణీయుండును, రాజర్షియు నగు మావసుమతీనాథుం డితర రాజన్యులవలెఁ బడరాని పాటులంబడుటకుం దగినంత కారణమేదేని యుండకపోదు. అక్కారణం బానతి యీావేడుచుంటి" ననిన వసిష్ఠుం డతని కిట్లనె."

"భూమండల మండనాయమానంబైన యవంతీపురం బొండు కలదు. అందు తిరస్కృతప్రభాకరప్రతాపుండును, చంద్రప్రభానిభంబై లోకాహ్లాదకరంబగు యశంబునకు నాలవాలుండును, రిపునృపకులాటవీదహనుండును, నీలలోహిత పదభక్తుండునగు నీలలోహితుండను భూకాంతుండు నివసించి ప్రజానురంజకంబుగా రాజ్యపాలనంబు గావించుచుండెను. ఆరాజునకుం గౌరవింపఁదగిన సద్గుణగరిష్ఠుండగు జవభద్రుం డను కాపువాఁడొక్కఁ డాపురంబునఁ గాపురంబుండెను. ఆతఁడు కృషిమూలంబున సంపాదించిన ధనధాన్య వస్త్రాభరణ పశుగణంబులు గలిగి జాయతోడం గూడి యనంతభోగంబు లనుభవించుచుఁ జాలకాలంబున కొక్కకుమారుం గనియె. ఆబుడుతఁడును నాదంబునఁ గందర్ప దర్పంబు నడఁగించుచు నల్లారుముద్దుగాఁ బెరిఁగి యల్లనల్లనఁ గౌమరుంబ్రాయంబుం బ్రాపించుటయుం దజ్జనకుండు కులశీలవయోరూపంబుల ననురూపయగు నొక్కకాపుపాపం దెచ్చి యవ్వానికి నుద్వాహంబుసేసె. అయ్యాది కలకంధరంబులకుం గలస్వనంబు లుపదేశించుచుం గలకంధరాభిధానంబున నొప్పుచుఁ గాంచనంబునకు రత్నంబబ్బినట్లు హాలికబాలున కాలుగా నుండి యుత్తమాముల చిత్తంబులో మెలంగుచుఁ దన మగని మాట జవదాటక సకలోపభోగంబులఁ దనియుచు నీడుజోడు గల నేస్తకత్తియలతోఁ గూడి చలువతూలసావడిని ఉాల్గురుగఁ బాటలు పాడుచు నేకు లాడుకుచుఁ గాలంబు పుచ్చుచుండె.

రాజిల్లు మగఱాల జిరాల గురాల నారోహించిన సేనానాయకు
లిరుగెలంకులఁ దన్నుం బలిసికొలువ నొక్క హయరత్నంబు
నెక్కి యుచ్చైశ్శ్రవంబు నధిరోహించిన జయంతునింబోలి యా
ప్రోలికేలికయగు నీలలోహితుం డొక్కనాటి సాయాహ్నం
బున వాహ్యాళి వెడలువాఁడై రాచబాటం బయలువెడల
నమ్మహోత్సవంబుఁ జూడ వేడుకపడి వీడువీడి వీదిగుమ్మములఁ
చేరు పౌరనారీజనంబుల కలకలంబు గగనంబు నిండఁ బర్వె.
అయ్యాలివాలించిన కలకంధరయు రాటంపుఁ బని ముగించి
తోడిముగుదలంగూడి వేడుకతోఁ దలవాకిలిఁజేరి మారునిం
బోలు నాభూరమణు నట్టె చూచుచుండ నాతండును నచ్చర
విరిబోణిం బోలి నిర్నిమేషలోచనమై తన్నుంజూచు నయ్యన్ను
మిన్నం గనుంగొనె. అంత నయ్యిద్దరపై ననంగుఁ డదనిదియని
చేతుల కసిదీరఁ గుసుమశర విసరంబులు గుఱియించుటం జేసి
యొండొరులు మోహపాశబద్ధులైరి. లోకోత్తర సౌందర్యంబు
గుఱిగా నెవరి కన్నులు గుట్టకుండును? అప్పు డప్పుడమిఱేఁడు
శాంతవడి రిచ్చవడి చూచి చూచి మానసం బెట్టులో దిట్ట
పరచుకొని పదియడుగులు ముందునకుం గుఱ్ఱంబును సాగించి
పట్టఁజాలని తమకంబుతో వెనుకకుం దిరిగి యప్పంట వాలు
గంటిని వాలుగంటం దిలకించుచు నల్లనల్లన నుల్లంబులేని
మేనితో నిల్లుచేరె. కలకంధరయు వసుంధరావల్లభుం గంటికగ
పడు నందాక నెగాదిగాఁ జూచి యావలఁ గన్నులనీరు గిఱ్ఱునఁ
దిరుగఁ దలవంచికొని తనభాగ్యముం దూరుచు శూన్యహృద

యంబుతో నెట్టకేల కిలుసొచ్చి యేమియుం దోచక పొర్దు పుచ్చుచుండె.

ఎందాక వలపువొడమదో అంతదనుకయె తగవు, ధర్మము, వావివరుసలును. వలపెంతవారినైన నీచపుయోచనల పాల్పడఁజేయును. అమ్మరునాఁ డహీవల్లభుఁ డిది యధర్మమని యించుకయు సందియం బొందక యక్కా-పుకొడుకుం బట్టించి కారాగారంబునం బెట్టించి వాని వారలఁ గొందఱ మాలలకు దాసులఁగా నమ్మించి యింటగల సొత్తంతయు దోచుకొని కలకంధరం దనయింటఁ జేర్చుకొనియె. ఇయ్యాపద కోపఁ దరంబుగాక జవభద్రుం డురిపోసికొని యసువులం బాసె. వాని బందుగులెల్ల ననలకీలఃబుల పాలైరి. ఈ రీతి నాశితారాతియగు నీలలోహితుం జేరి యత్తవారిల్లు నట్టేటం గట్టిన కలకంధరఁ దనకోరిక తీర మనశ్శాంతినొంది రాజభోగంబుల హాయిగాఁ గాలంబు గడపుచుండె.

ఇట్లుండఁ గొంతకాలంబునకు శరదృతుప్రారంభంబయ్యె. కలుషితంబులగు నదీజలంబులఁ దేరుపఁగతకబీజంబుచందంబున నగస్త్యుం డాకసంబునం గాననయ్యె. శరల్లక్ష్మికిడిన చామరంబులునాఁ గాశంబులు వికాసంబునొందె. ఇచ్ఛపొదలఁ బచ్చికలమేసి గోగణంబులు పుష్టంబులై సంతసంబునం బొదలుచుండె. పొంకంబుగల పంకజంబుల నలంకరింపంబడి కొలంకులు కలంకందేరె. పరిపక్వసస్యసంపన్నంబులైన కేదారంబులు కనువిందొసంగుచుండె. అట్టియెడ విజయదశమి సంప్రాప్తంబగుడు

నగరంబునం గేదారగౌరీ వ్రతాదరాయత్తచిత్తంబులు గల కలకంఠుల కలకలంబు కలయంబర్వ నాసవ్వడి నాలించి కలకం ధర తనసాధోత్సాహం బధిరోహించి యన్నారివారంబునీక్షించి యతికుతూహలంబున రాజపురోహితుం దననెలవునకుం బిలి పించి కృతోచితసత్కారంబుల సంతుష్టుండగు నాతనికిఁ జేతులుజోడించి దీవనలం బొంది "యోగురువర్యా! ఈనాఁట నీవీటిసీమాటులెందఱో యేదియో పుణ్యవ్రతం బాచరించు జాడ చూడంబడుచున్నయది. ఆవ్రతంబు నామం బెద్దియో? దానగు ఫలంబేదియో? అది మున్నెవ్వరిచే నారంభింపఁ బడెనో? దాని నాచరించు విధానం బెటులనో? సర్వంబు నామూలాగ్రంబుగా నానతీవే" నావుడు నవ్విప్రోత్తముండు "ఓపుత్రీ! అది కేదారగౌరీవ్రతంబు. దానిఫలం బింతయని చెప్ప నలవికాదు. సమస్త పాపాపహరంబు, పరమైశ్వర్యప్రదంబు, భక్తులపాలింటి పారిజాతంబు, అద్దాని మున్ను పార్వతీదేవి యాచరించి శివునిసామేనుఁ బడసె, తరువాత వేలుపుటిల్లాండ్రు పెక్కండ్రాచరించి యభీప్సితంబుల నందిరి. ఆవ్రతంబు నాశ్వ యుజశుద్ధ దశమినాఁడారంభించి యయ్యమావాస్యతుదిగా నత్యంత నియమముతో నాచరింపవలయును. అదియెట్లన్న వ్రతమాచరించువారా దశమినాఁడు రేపకడ లేచి యిష్టదేవతాధ్యానపురస్సరంబుగా దంతధావనాదులగు కాల్య కృత్యంబుల నిర్వర్తించి వర్ణాచారానుసారంబున స్నాన సంధ్యాదులగు ననుష్ఠానంబులఁదీర్చి దేవతాగృహంబు గోమ

యంబున నలికి డమరుక త్రిశూలాదులగు నీశ్వరచిహ్నంబుల రీతి ముగ్గులువెట్టి, నూతన కనకాంబరమున వితానంబు వన్నించి, ద్వారశాఖలకడ రంభాస్తంభంబులనిలిపి, చూతపల్లవ తోరణంబులఁ గట్టించి, యంచితభక్తి నన్నాఁడుపవసించి, సాయంసమయంబునఁ బూజాస్థానంబునందలి మండపంబుపై బంగారుకలశంబు నునిచి, తదుపరి నూతన పీతాంబరంబిడి, యందు గౌరీశంకరుల యావాహనంబొనర్చి సకలోపచారం బులఁ బూజించి, నాటంగోలె యిరువదియొక్క వాసరంబులను శేలఁ దొలిజామునఁ దద్దేవతారాధనంబు సేయుచు, సన్నంబు ముట్టక భోగంబులవిడిచి స్థండిలంబును బరుండుచు ఫలాహా రంబుసేయుచు నెల్లపుడు ధౌతవస్త్రంబుల ధరియించుచుఁ బర గృహంబులకుంబోక మనోనియమంబు గలిగి తొలినాఁటి పిండివంట మఱునాఁడు సేయక నాఁటికొక్క పిండివంటగా దేవునికి నివేదించుచు ననుదినంబును గోక్షీరాభిషేకంబును దివ్యగంధచందనాక్షతాంబరా లంకారంబులును వికసితకుసుమ విసరార్పణంబును విడువక నడపించుచు నవమసనాఁడు విశే షంబుగఁ జతుష్షష్ట్యుపచారంబులఁ బూజించి సూపాపూపపర మాన్నాదులగు మధురాహారంబులతోడ మహానైవేద్యం బర్పించి తాంబూల నీరాజన మంత్రపుష్పంబుల సమర్పించి పరిశుద్ధంబగు పట్టుతో వడకంబడి యేకవింశతి తంతుసంతతిఁ గలిగి, యేకవింశతి గ్రంథిబంధితంబగు సురభికుసుమపల్లవ శోభితంబగు తోరం నీశ్వరసన్నిధిం బూజించి వేదవేదియగు

భూదేవునివలన నాశీర్వాద పురస్సరంబుగాఁ గైకొని మణి కట్టునం గట్టుకొని యయ్యగ్రజన్మునకుం దక్షిణతాంబూలా దుల నొసంగి నమస్కరించి పార్వతీపరమేశ్వరులకుం గేలు మోడ్చి యనంతర ముచితభోజనం బొనర్పవలయును. మిగుల భక్తితోడ నీవ్రతం బిరువదియొక్క వత్సరంబు లాచరించి కడ పటిహాయనంబున నొక్కచో నిరువదికలశంబుల నిలిపి కల్పం బున నున్నరీతి నుద్యాపనంబు సేయవలయును. వ్రతఫలం బిచ్చునది యుద్యాపనంబు కావున నద్దాని మానఁగూడదు. అయ్యుద్యాపన సమయంబున బ్రాహ్మణ సంతర్పణంబును మహాదానంబులును జేయదగినవి" యని రాజపురోహితుం డిట్లుసెప్పఁగా విని కలకంధర తానావ్రతం బాచరింపఁ దలంపుఁ గొని పురోహితుంబంపి పిదప నల్లన నీలలోహితుం జేరి "వల్లభా మనపురంబునం బురంధ్రీమణు లిపుడు కేదారగౌరీవ్రతం బాచ రించుచున్నారు. అది యుత్తమవ్రతంబని మన పురోహితులు నానతిచ్చిరి. నేనద్దాని నాచరించి దురితపుంజంబులఁ దొలఁ గించుకొనఁ దలంచితిని. అద్దాని కనువులగు నుపకరణంబు లొడఁగూర్చి నన్ను ధన్యంజేయవే"యని దయగలుగునటుల వేడికొన నాతండు నన్నాతికోరిక కొడంబడి కావలసిన యుపకర ణంబుల నాయత్తపఱచుచుండ నయ్యింతి నియమముతో నన్నోము నోము నారంభించి విడువక యాచరించుచుఁ గడపటి హాయ నంబునం బురోహితోపదిష్ట ప్రకారంబున నుద్యాపనంబు నుం గావించె. అట్లా కలకంధరతద్వ్రతం బాచరించుటం జేసి మరుసటి

జననంబు జననాయకుఁ దనూజయై జనియించి సత్యనిష్ఠాగరిష్ఠుం డగుచక్రవర్తిం జేపట్టి పట్టమహిషియయ్యె. ఆమెయె యీచంద్రమతి. ఈకులపాలిక పూర్వపుంబుట్టువున నత్తవారియన్వయంబు హానిఁజెందుటకుం గారణం బైన పాపంబుకతంబున నీజన్మంబునం బితృవంశ నిర్మూలిని యయ్యె. కులశీలంబులు పాటింపక యన్యపురుషు నాశించిన కారణంబున గష్టకరంబగు దుష్టముహూర్తంబున రజస్వలయయి జననీజనకులచే విడువంబడియె. సకల కలుషహరంబగు కేదారవ్రతం బాచరించుటం జేసి కొంతకాలంబు పతివియోగంబునందియు, నగ్నింబడియు, దాసిగా నమ్మఁబడియుఁ బుత్రశోక మనుభవించియుఁ దుదకీశ్వరానుగ్రహంబున సమగ్రైశ్వర్య సంశోభితయై యఖండానందం బందఁగలిగె. తోరంబుగట్టుకొను కాలంబున నెన్నిజన్మముల కేని నీలలోహితుఁడే భర్తకావలయునని కోరుకొనినందున హరిశ్చంద్రుఁడై జనించిన నన్నీలలోహితునకే భార్యయయ్యె. హాలికబాలికా శీలంబు నేలపాలుచేసి యద్దాని మామచుట్టంబులను జండాలురకుఁ దాసులుగా నమ్మిన హేతువున నిన్నరేంద్రుం డఖిలలోక పావనంబగు నాదిత్యాన్వయంబునం బొడమియు సత్యపాలన కైతవంబున మాలవానికి దాసుఁడుగా నమ్ముడువోయె. అని యిట్లరుంధతీ కళత్రుండు చంద్రమతీ హరిశ్చంద్రుల పూర్వజన్మ వృత్తాంతకథనంబున హరిశ్చంద్రుని కష్టకారణంబులఁ దెలుప సత్యకీర్తి యత్యంతాశ్చర్యంబు నొంది కొంతవడికి వసిష్ఠుంజూచి

"అయ్యా ! మాయయ్యగారి పూర్వజన్మవృత్తాంతము సెల విచ్చి చిత్తంబలరించితిరి. అమ్మగారి తొలిపుట్టువుం గుఱించియుఁ దాముచెప్పినచొప్పు వింతగొలిపెడిని. అది యటుండ నిండు. ఈసాధ్వీమణి గళంబునంగ్రాలు తాలిబొట్టు నిజనాథునకుంగాక యొరులకుం గానఁబడకుండుటకుం గారణంబెద్ది ? ఈయోషామతల్లిం గన్న తలిదండ్రులెవ్వరు ? అవ్వారీమెను విడుచుట కేమి హేతువు? ఈమె మయునిపుత్రి యెట్లయ్యె ? అని నామనంబున సందియంబులు కలవు. వానిం దొలఁగించి మీకీ శ్రమగలిగించినందులకు నన్ను క్షమియింపఁగోరెద" నని యడుగ నత్తాపసోత్తముండు చిత్తంబున నలరి యిట్లను. "మంత్రిపుంగవా! ఈమహీమండలంబున వారవంతంబను పేరం బ్రఖ్యాతిఁగాంచిన మేటిపీటం బలసంపన్నుండగు జ్యోతిష్మన్నామక మూర్ధాభిషిక్తుండు కలండు. ఆతఁడు దిగ్విజయవశీకృతరాణ్మండలుండై జంభారివైభవంబున బహుకాలంబు నేల నేలి యనంతసుఖంబు లనుభవించియు నయనానందకందళం బగు నందనుంగాంచు సుఖంబు కొఱంతగా నెంతయు మనంబున దురపిల్లి సచివసకంధన్యస్తసమస్తరాజ్యభారుండయి, హిమాలయ ప్రాంతంబునకుం బోయి యాశ్రితరక్షణ పరాయణుండగు శ్రీమన్నారాయణుం గూర్చి పెక్కు హాయనంబులు పెద్దతపం బొనర్చె. అద్దానికి సంతుష్టుండై పుండరీకాక్షుండు పొడసూపి "యోవత్సా ! పుత్రసంతానముం గోరి తపంబొనరించితి. కాని యయ్యది నీకీజన్మం

బునం బడయ వీలుపడదు. కాని నా యనుగ్రహంబునం బుత్రి కారత్నంబును గాంతువు పొమ్మని యంతర్హితుండయ్యె. అయ్యిలాపతియుఁ గొంతదీరని మనోరథలాభంబున కించుక సంతసించి స్వాధిష్టానంబుచేరి యథాపూర్వంబుగాఁ బాలించు చుండె. అంతఁ గొంతకాలంబున కాతని రాణి దైవానుగ్రహం బున గర్భవతియై నెలలునిండ నాడునిసువుం గనియె. అప్పుడు కూతుం దద్దయుం బెరిమెతోఁ దలిదండ్రులు పెంపఁ నాఁటఁ బెరుగునది పూటఁబెరుగుచుఁ గపురంపుంబొమ్మవోలె వారికిం గనువిందు చేయుచుండె. రాజా కన్నియ జన్మలగ్నంబు నందలి శుభాశుభంబు లరసి తెలుపుఁడని జ్యోతిష్కుల నడిగె. వారును అబ్బాబ్బె పుట్టిన వేళలోని గ్రహసంచారాదు లాక ళించి యాపె తలిదండ్రుల యాయురారోగ్యైశ్వర్యాదులకు హాని కలిగించునని యెఱింగియు నధిపు హృదయంబునకుం గష్టంబు గలుగునను సంకోచంబున నిజంబుఁ దెలుపక "అయ్యా మీకుమారి పుట్టిన వేళ మంచిదే" యనిరి. అబ్బాలయు నా నాఁటఁ బెరిగి పెద్దదై పదాఱవయేట మిగుల దుష్టురాలై, జన కుని కరి తురగ రథ పదగాదులు నశించుటకుం గారణంబగు లగనంబున నీడేరె. అపుడును ధరావరుండు జోసులఁ బిలిపించి సమయఫలంబుఁ దెలుపుఁడన వారు విమర్శించి దుష్టఫలంబు సెప్పుటకుం గళవళపడియు నిక నిజము చెప్పకున్న రాజునకు హానియుఁ దమకుం గృతఘ్నతయు వాటిల్లునని యాలోచించి "నరవరా! తమ దుహిత జనించినవేళయే మంచిదికాదు. అది

యొకింగియు లేక లేక కన్న బిడ్డకదాయని జాలిఁజెంది వెల్లడింప మానితిమి. ఈమె పుట్టిననాఁటనుండియుఁ గలుగు కష్టంబులు పెక్కులు కలవు. అవి యన్నియు నుగ్గడింపనేల? గడచిన వానికి వగనొందనేల ? ఇప్పు డిమ్మంజువాణి యీడేరన మూరుతం బంతకునుం గీడైనది. మీయెదుర వివరింప నాలు కాడకున్నయది. చెప్పకున్న స్వామిద్రోహులమగుదుము” అని పలికి తమకుం దెలిసినంత చెట్టను గుట్టువెట్టక వెలివెట్టిరి.

అపుడప్పుడమిఱేఁడు వెలవెలవోవు మొగంబుతోఁ దల వంచుకొని “అయ్యో నాచిన్నిపాపా, నాపాలిఁట భాగ్యదేవత వనుకొంటి. నాయూహకు వేరుగా నేమో కొరగాని కబురులు విననయ్యె. వీరిమాటలు పాటింపకుండుటెట్లు? నీవివాహాది మహోత్సవంబులు వేడుకతోఁ జూడనుండ దైవము వేరొండు దలంచె, నేనేమిసేయుదు?” ననుచుఁ బలవించి నిశ్చేతనుం డయ్యె. అప్పుడయ్యెడం గల ప్రెగ్గడ వెడందఁ గడునడలి యయ్యొడయనిం జేరి కడుమెలఁకువతోడం దగు నుపచారంబు లాచరించి యథాస్థితికిఁ దెచ్చిరి. పిదప నన్నేలయేలిక యెట్ట కేలకుం దిట్టతనంబూని “అయ్యో యీపాపపుంబాఱులు నాపాపపుట్టిననాఁడే యిది చెట్టయని చెప్పరైరి. చెప్పినచో నింతదీర్ఘపుం బ్రేమయుఁ దానం గడునడలునుం బొడమకుం డును గదా” యని యిట్లుకొంతవడి యంగలార్చి నిజామా త్యులం గనుంగొని “సచివోత్తములారా! నాయోగుబాగులకుం బ్రతిభువులు మీరలేకదా? మీచెప్పినట్లు నడచుట నాపని.

ఇందు నాకపాయములేని యుపాయంబు దెలిపి నన్ను ధన్యుం జేయుఁ"డనిన మనుజపతిం గనుంగొని చనవుగల సచివుండొకం "డో మహాప్రభూ ! ఈచిన్నికన్నియ జన్మించిననాటంగోలె పెక్కు లనర్థంబులు మనకుం గలిగినవి. కార్తాంతికుల మాటలు, బూటకంబులు కావు. కావున నిక్కంబు నెక్కననైన విడుచుటమే" లనె. అంత మఱియొక మంత్రి నిలువంబడి "దేవా ! ఇవి యెక్కడి మాటలు. స్వప్నశకున సాముద్రిక గ్రహసంచారంబులు దృశ్యాదృశ్య ఫలంబులు. వానిం బ్రమాణంబు లనరాదు. జ్యోతిషికుల మాటల నమ్మి కన్నకన్నియఁ గానపాలు సేయఁజూచు టనుచితం" బనియె. అట్టితఱి నీతివిశారదుండగు దూరదర్శియను వృద్ధమంత్రి ప్రభున కభిముఖుండై "పార్థివేంద్రా ! శాస్త్రంబులు వితథంబు లనరాదు. ఎంతవారికిని ధర్మసూక్ష్మంబులు దుర్గ్రాహ్యంబులు. లేకలేక కలిగిన బిడ్డయని జాలిఁజెంది, చెట్టఁగూరుచుపట్టి నింట నిడుకొననురాదు. నిరపరాధయగు చక్కెరబొమ్మం జక్కడఁ దలంపనురాదు. ఏదే నొక్కతెఱంగున నాపెం బరిహరించుట మంచిది. దాన మనయాధి యడంగును. అదృష్టవశంబున నామె మేలుగాంచినం గాంచును" అని హితంబును బాపరహితంబునుగా నుడివిన యమ్మంత్రిశేఖరు నుపదేశంబు గురూపదేశంబుగాఁ గైకొని రాజు తన విచారంబు లోలోన నడంచుకొని ఋతుస్నాత యగునంతకుందనపుత్రి నొకరహస్యమందిరంబుననునిచి విడువఁదలంచి యాజాడ నాచేడె కెఱుకపడకుండు

లాగునఁ గట్టడచేసి స్నానంబుచేసిననాటి నడురేయి నొడలు
మఱచి నిద్రించు నమ్మించుఁబోఁడి నించుకేని సంకోచింపక
మందసంబునం బదిలంబుగఁ బరుండఁబెట్టించి తాళంబువైచి
వారవంత పురాంతికంబునం బారు తరంగిణింబెట్టించి గెంటించి
పొరలివచ్చు దుఃఖంబడంచుకొనుచు నెట్టెటో నిజమందిరంబుఁ
జేరె. ఆపెట్టెయుఁ బొంగిపొరలు నన్నదీప్రవాహంబునం బడి
తేలియాడుచుం బోవుచుండ నందున్న యన్నులమిన్న ప్రబో
ధంబునంది లేచి కూరుచుండ ననువుగానక దొరలిపడుచు నంత
కుముందు తనవారు చెప్పుకొను తన్నుగుఱించిన జెడువార్త
లందంద వినియున్నది కావున ముందు వెనుక లాలోచింపక
తనవారే తన్నిట్లు నీటం బడఁద్రోసియుందురని తలంచి
"అయ్యో, మాయయ్య యయ్యవారుల మాటలంబట్టి కట్టి
డివై నన్నేటఁ ద్రోయించెఁ గాబోలును. కాకున్న నిన్నిటం
బెట్టెలో నుండుటేల? ఓతండ్రీ! నిర్దయుండవై యిట్లు వెతల
పాలుసేయుటకన్న కరవాలునఁ గంఠంబుఁదెగంగొట్టలేక పోయి
తివా? పాఱులారా! నాపుట్టిననాఁడే ఈరవంతపుణ్యంబు గట్టు
కొన్నమేలగునుగదా? కన్నవారికే కనికరంబు లేనప్పుడు మిమ్మ
నఁబనియేమి ? తల్లీ ! కడుపారం గనిపెంచిన నీకైన జాలిలేక
పోయెనే? నాసమర్తవేడుక కీపెట్టె యుయ్యాలతొట్టె
యయ్యెనా? ఓపుణ్యస్రవంతినీమతల్లీ ! నన్నొక్కనూరు
ముంచి ప్రాణంబులతోఁబాటు దుఃఖంబును దుదముట్టింపవే "
యనియిట్లుయేటిగట్లు మాఱుమ్రోతలిచ్చులాగున నేడ్చుచుండ

నప్పేటికి దరులఁజేరక ప్రవాహంబునంబడి కడుదూరంబు కొట్టుకొని పోవంబోవ నొక్కయెడ నయ్యాపగాతీరస్థితంబగు పుణ్యారణ్యంబునం దపంబుసేయుచున్న మయసంయమీంద్రుం డక్కయ్యాలించి యటునిటుం జూచి ఝరీవేగంబునం బోవు నమ్మందసంబుం జూచి తన యంతేవాసులచేఁ దీరంబునకుం దెప్పించి బీగంబుదీయింప నందచ్చరకన్నియలకన్న మిన్నయు, నిలాకాంతా కాంతుఁడగుటంజేసి నిజేశునిపై నీసుగొని వచ్చిన లచ్చియా యనందగునదియు నగు చక్కరబొమ్మ కానవచ్చె. ముని యత్యంతాశ్చర్యమగ్న మానసుండై చూచునంతలో నయ్యింతియుఁ దటాలునం బేటికనుండి లేచి వెలువడి యుత్తల పాటునడఁచుకొని పయ్యెదసవరించుకొని యలకల నెగదువ్వుకొని జాలువారు కన్నీరుదపయ్యెనకొంగునం దుడిచికొనివినయంబున నించుక తలవంచి చేతులు జోడించి మ్రొక్కిడ నమ్ముని "దీర్ఘసుమంగలివగు" మని యాశీర్వదించె. అద్దీవన విని యమ్ముద్దియ "యోయయ్యా! యియ్యాశీఃఫలంబు నొందు పాటి భాగ్యంబు నాకెక్కడిది? కట్టిడి మారుతంబునంబుట్టిపుట్టిన యిఁటికిం జెట్టనయితిని. అంతకంటెం జెడుకాలంబునం బుష్పిణినై దుష్పీడలం బడఁబాలైతిని" అని తనయావద్వృత్తాంతంబును విన్నవించి రోదనంబు సేయఁదొడంగె. కేవలకారుణికుండగు నమ్మయుం డంతయు విని "తల్లీ! నీవుత్తలంపడకుము. మహార్తికుల పలుకులు సత్యంబులు. అయినను నాయాశీర్వాద బలంబున నీకుం గలుగనున్న కీడు తొలంగును. భద్ర

ప్రాప్తి నొందుదువు. జగద్విఖ్యాత కీర్తిగల చక్రవర్తికిం గళత్రంబవై చంద్రమతి యనుపేరం బ్రసిద్ధవై సర్వ సౌభాగ్యంబు లనుభవింతువు. నీకుం గలుగఁబోవు కీడులన్నియు నీ మంగళసూత్రంబు నావరించు. దానంజేసి నీగళంబుననుండు మంగళచిహ్నంబు నీ వరునకుంగాక వేరువారికిం గానరాకుండును" అని నుడివి యామెనోదార్చి యమ్ముని తా విశ్వకర్మ కావునఁ దనయాశ్రమంబున నెల్లయందంబుల కాలవాలంబగు నొక్క సౌధముం దన నేర్పు మెయి నేర్పరించి దాన నచ్చాననునిచి వలయు వస్తుసందోహంబు తోడఁ బెక్కురు పరిచారికల సృజించియిచ్చి కడుంగడు బెరిమతోఁ బెంచుచుండె. ఇట్లుండఁ గొంతకాలంబునకు వసంతకాలము రాఁగా నొక్కనాఁడా చంద్రమతి తనచెలికత్తెలం గూడి యుద్యానంబున విహరించుచుఁ బూదేనియలఁ గుత్తుకబంటిగా నాని సోలియాడు నాడుతుమ్మెదల సోయగంబులకుం జొక్కి పెక్కుభంగుల సంతసిల్లు రోలంబముల రొదలఁ బాదలు పొదల దాగుడుమూత లాడుచు, మృదుళలతా వితానంబుల నుయ్యాల లూగుచు, మంజుల సహకార నవదళాస్వాద కషాయకంఠంబులగు కలకంఠముల కూతలకు మాఱు గూయుచు సుస్వాదుఫల రసంబులనాని కెరలి పలుకు చిలుకల నెగఁజోపుచు బుప్పొడితిప్పలనెక్కి యాడుచు గొజ్జంగి పూసెజ్జలం బవ్వళించుచుఁ గృతకాద్రులపై కెక్కి దూకులాడుచు, బరిమళ భరితంబులగు విరులఁ దురుములం దురిమి

కొనుచుఁ గిసాలంబుల నునుగోరులం జిదుముచు బువ్వులేరఁ బరుగులు వారుచుఁ, గడుంగడు నలసి జలకేళిసవరింపఁ దలంపున నచ్ఛోదకంబుగల కమలాకరంబు తీరంబునఁ జేరి చీరలవిడిచి చిరుపావడలఁగట్టి యొండొరులు కైదండలూని మెల్లన నత్తటాకంబు సొచ్చి యిచ్చపొదల జల్లులాడి యొండొరులమీరి యీదులాడుచు నొండొరుల మొగంబుల నీరుజల్లుచు దమ మొగంబులం బురుడించునివియను నీసునంబలెఁ గుశేశయంబుల శయంబులం ద్రుంచివైచుచు నొండొరులం జుట్టుకొని పంతంబుల నీటముంచుచుఁ దరంగంబుల నుయ్యాలలూగుచు గంతులిడుచుఁ గేకలువైచుచు నిచ్ఛావిహారంబుల నోలలాడి కొంతవడికిఁ దనివిఁదీరి యందఱుంగలిసి యక్కాసారంబు వెలువడి తడివలువల విడిచి మడుంగుచీరల ధరియించి పరిష్కారపరిష్కృతలై తీరంబుననున్న గున్నమావిసీడనువిశ్రాంతినందుచుండిరి. అత్తఱి మారుంగేరు నొక్కరాజకుమారుడు ధనుర్బాణపాణియై యాజానేయంబగువాజి నధిరోహించి యాఖేటకపరిశ్రాంతి యచ్చుపడ నచ్చోటికివచ్చి యప్పటికచ్ఛోదకంబగు నమ్మిరాకరంబు నీరంబు లారగింపఁ గోరికతో హయావతరణంబొనర్చి నీరువట్టుదీర నీళులంగ్రోలి పరిశ్రమాపనోదనార్థ మక్కడి సహకారతరుచ్ఛాయం దీరికతోఁ గూరుచుండి తనకెదురఁ గొలంకు నావలిదరి నపరిమిత సఖీపరివృతయై సుఖగోష్ఠినున్న యయ్యన్నులమిన్నం గన్నారఁ గనుంగొని "యిమ్మహారణ్యమధ్యంబున నియ్యుపవనం బెక్కడిది?

ఇందీ సొగసుక త్తెలుండుటకుం గారణంబేమి? పరికింప నియ్యది మయుని యాశ్రమంబుగాఁ దోఁచెడిని. ఇన్నెలవున కెన్ని సారులో యాఖేటకపరిశ్రాంతుడనై యరుదెంచి విశ్రాంతిఁ జెందియుంటినికదా. ఏనాఁడు నిందాడువారలఁ గాంచి యెఱుంగను. అందీ సోయగంబులప్రోవగు వన్నెలాడిం జూడ నామనంబేలొకో తత్తరంబు నొందుచున్నయది " యని యాలోచించుచుండ నయ్యంగనామణియు నాతనిం దేరిచూచి సిగ్గున దిగ్గునలేచి పూచిన పొన్నగున్న మఱుఁగున మఱుంగు వడి యొక్కకీరవాణిం జేరి "చెలీ ! చారుతావిజితమారుండగు నారాజకుమారు తీరుఁ గాంచితే ? ఆతం డేవంశీయుఁడో నిందుల కెందులకు విచ్చేసెనోకదా " యని ముచ్చటింప నింగితజ్ఞురాలగు నాలేమ సానుజయానంబున భూమీశుంజేరి "యోసుకుమారా! మీరెవ్వరు? మీనామమున నుండ నోచిన యుత్తరరాజంబు లెవ్వి ? మీవిరహంబున నేదేశ మిపుడు చెన్నుఁ దొఱంగియున్నది? యిచటి మీరాకకుం గారణంబేమి? ఇయ్యది ప్రమదావనంబు గావున నిట్లడిగెద" ననుటయు మందస్మితసుందర వదనారవిందుండై నరనాథుం డిట్లనియె. "కాంతా ! యుత్తర కోసలదేశంబునందయోధ్యాపురంబున మాకాపురంబు. త్రిశంకు మహీవల్లభ తనూజుండ. మన్నామంబు హరిశ్చంద్రుఁడు. వేఁట తమకంబునఁ గానలఁ దిరుగాడుచుఁ గడునలసి యిచ్చట నిక్కాలఁకుంగని దప్పికవాయఁ దోయంబులాని విశ్రాంతిఁగోరి కూరుచుంటిని. అల్లపల్లవాధ

రల మధ్యంబుననుండి వెడలి పొన్నమాటున నిలువంబడిన మహిళాలలామ వృత్తాంతం బాంతంబుగా నీకుం దెలిసిన నెఱిం గింపఁగోరెద” ననిన నప్పువ్వుఁబోఁడి “రాజకంఠీరవా ! ఆలేమ మాయేలికసాని. జ్యోతిష్మన్నృపాలుని పుత్రిక. మయమహా సంయమి ప్రేమపెంపునం బెంప నిందుఁ బెరుఁగుచున్నయది; యామెపేరు చంద్రమతి”యని వచింప నన్నేలయేలిక మనం బున సంతసించి “యాహా ! యిది మునిపుత్రియని మనంబున లేనిపోని వితర్కములు వెట్టుకొని జంకుచుంటిని. మదీయంబగు మానసం బట్టిదానిపైఁ దగులంబుఁగొనునా?”యని కొంతవడి చింతించి యాపెం గనుగొని “మంజువాణీ! అయ్యరవింద గంధిని గాంధర్వంబునం బెండ్లియాడ మాకుం గోరికకలదు సుమా” యని తన యంతరంగంబు వెలిపుచ్చునంతలో నంతంతఁ గాంతారాంతరమునఁ జెదరితడసిన సైనికులా యిలేశునిఁ జేరవచ్చి శంఖకాహళ భేరీప్రముఖ మహా వాద్యంబుల వెలయింపఁ దన్నాదంబునకులికి ముని బాలకులు తత్తరంబున మయుంజేరి “గురువరా ! యిమ్మహా నాదంబునకుం గతం బారసి మాయెడ దుడుకుడుపవే” యన నాసంయమి తన దివ్యదృష్టిం గల రూపెఱింగి “బాలకులారా ! యీసందడి మా రండకులమండనుండగు హరిశ్చంద్రుని రాకవలనఁ గలిగినది. ఇందులకుం గొందలం బొందఁ బనిలేదు” అని యూరడంబలికి వారలనుగమింప నక్కుంభినీధవుం జేరనరిగి తన్నుఁగని వందనంబొనర్చిన నర

పతి నాశీర్వదించి యుచితసత్కారంబులొనర్చి "రాజరాజా! మీ తండ్రిగారి తరువాత ధరాతలంబున కధీశుండవైతివని విని నది మొదలు నిన్నొక్కమారు చూడవలెనను దలంపుగలదు. అది యాదృచ్ఛికంబుగ నిట నొనఁగూడె" నన నయ్యుర్వీజాని "మానీంద్రా! మీయనుకంపకుం బాత్రుండనైతిం గావున వైళంబ కళ్యాణం బాదఁగలుఁగుదునని తలంచెద" నని కృతాంజలియై, చంద్రమతియందుఁ గల తనయభిలాషముం దెలుప నాసన్నుండగు నొక్కచెలికానిం గనుగీటుటయు నాసఖుండా మునిప్రముఖునకుం గృతాంజలియై "యయ్యా! మారాజశేఖరుండు వేఁటతమకంబునఁ గడుంగడు నలసి దారితప్పి దప్పిగొని యొప్పులొలుకు నియ్యప్పులకుప్పం గని పిపాసఁదీరి యిచ్చుటఁ దమమన్ననం గాంచె, నిటమీఁద మీవలన నొండు మేలు వొందఁ డెందంబునఁ దలంచె, నది యెద్దియంటిరా? ఈతఁడీ తటాకంబుతటంబున నొకబాలికం బొడఁగాంచి యామెం బెండ్లియాడఁదలంచె. అయ్యువిదయుదంతం బారయ జ్యోతిష్మంతుని యాత్మజ యనియుఁ దమకుం బెంపుడుకూన యనియుఁ దెలియవచ్చె" నని విన్నపంబుసేయ నత్తాపసి యంతరంగంబున నింతింతనరాని సంతసంబూని నామాన యీకోనయుండియుఁ జక్రవర్తికళత్రంబుగా నోచెనని యుబ్బుచు, "నోరాణ్మిత్రుఁడా! సిరిరా మోకాలొడ్డువాఁడుం గలఁడే? ఇష్టట్టున మాపట్టిం జేపట్టుటకు మీపట్టభద్రుఁడు సందియం పడనేల? నేఁట జేపట నింనుండి

మాకు నల్లుండై పురంబునకుం బోనగును" అనిచెప్పి వారికిం
దగిన విడిదలఁ జూపి నివసింపఁజేసి తనతపోబలంబున వలయు
పదార్థంబుల నెల్ల నొడఁగూర్చి, యాశ్రమవాసి తాపసుల
యనుమతి నమ్మునినాఁడ సుముహూర్తం బేర్పరించి యంతే
వాసుల నయ్యాయిపనులకు నియోగించె. ఇయ్యుదంతంబం
తయుసఖీముఖంబున నాలించిన చంద్రమతియు నతిముదంబునం
బొదలుచుండె. అల్లనల్లన సాయంసమయ మగుటయుఁ దన
మనుమని వివాహమహోత్సవంబునకు ఖండాంతర నివాసులఁ
బిలువంబోయెనా యన దివాకరుఁడ స్తమించె. గగనకాయ
మాన వితానంబున వ్రేలాడఁగట్టి పాదరసపుఁ గాయలవలెఁ
దారక లీరికలెత్తె. భువనాంతరాళ వైవాహికాగారంబునకు
సుధాలేపంబుసేయ సురశిల్పి నిల్పిన సుధాభాండంబు చందం
బునఁ జందమామ యుదయగిరి నందగించె. పండువెన్నెల
గాయుచుండఁ బెండిలిపనులొనరించు తాపస మాణవకులకా
రేయెంతయో సాయంపడుచుండెను. అంతం గొంతసేపటికిం
బ్రభాతంబగుటయు నెల్లి చంద్రమతీ వివాహంబు గావున విశ్వ
కర్మచే నిర్మింపంబడి దేవతలచే నంపఁబడు తొలిబొట్టు చందం
బున లోకబాంధవబింబంబు దూరుపుఁగొండపై నుదయించె.

అంత నమ్మునియుం దాత్మతపోబలంబునం జేసి తన
యాశ్రమంబొక నగరరాజం బగులాగునఁజేసి మాణవకులచే
సూర్యచంద్రవంశజన్యులగు రాజన్యులను బ్రహ్మర్షిరాజర్షులను
బిలిపించి మంగళశృంగార విరాజితులగు వధూవరులఁ బరిణయ

మంటపమునందలి పెండ్లిపీటపై గూరుచుండఁబెట్టె. అప్పుడు పురోహితుల మంగళ మంత్రరవంబులును మహామునుల యాశీర్వాదనాదంబులును నాగవాసంబుల నృత్యగీతస్వనంబులును భేరికాపటహాది మంగళతూర్యరవంబులును బేరఁటాండ్రపాటలయులివులును గలిసి మిన్నుముట్టనతివైభవంబుతో జంద్రమతీహరిశ్చంద్రుల వివాహంబు యథావిధానంబునం బ్రవర్తిల్లె. అట్లయ్యుద్వాహంబైన పదంపడి మయుండు మణిమయాభరణాంబరాదులను మంజులాన్నంబులను బరితృప్తులఁజేసి మునులను మనుజపతులను వీడ్కొలిపి యల్లునకుం గూఁతునకు నపరిమితంబులగు ధనకనకవాహన దాసదాసీజనాదుల నుడుగరలొసంగి, యొకనిస్త్రింశ మల్లునికిం జూపి "మహీవల్లభా! యియ్యది మదీయంబగు తపఃప్రభావంబునం గలిగె. దీనిపేరు చంద్రహాసము. దీనిం ధరించి సంచరించితివేని నేరికి నజేయుండవగుదువు. దీనింగైకొను" మని యిచ్చె. అదియే కదా భేతాళుని వశపఱచుకొనుటకు సాధనంబయ్యె. హరిశ్చంద్రుఁడట్లు ఖడ్గంబును బడసి మయుని యనుమతి వడసి చంద్రమతీ సహితుఁడై యయోధ్యకుం బయనంబై వెడలుటయుఁ జంద్రమతి మగనిపై నెంత మమతయున్నను మన్ననతోఁ బెంచిన మయుని విడువ మనసురాక కంటనీరువెట్టఁగనుంగొని మయుఁడు "అమ్మా! యిట్లు చింతింతువేల? చక్రవర్తిం జేపట్టితివి. రమాకుమారుం బోలు కుమారు నచిరకాలంబునం గాంతువు. అపుడపుడు నేను మీపురంబునకు

వచ్చి యోగక్షేమంబు లారయుచుండును" అని యారడఁ బలికి సాదరంబుగా సాగనంపెను. హరిశ్చంద్రుండు సతీ సమేతుఁడై కనకరథంబెక్కి సైన్యంబు గొలిచిరాఁ గదలి కతిపయప్రయాణంబుల నిజపురంబుం బ్రవేశించె. పదంపడి సకల సుఖంబు లనుభవించుచు రాజ్యపాలనంబు సేయుచుఁ గొంత కాలంబునకు జంద్రమతియందు లోహితాస్యుం గని యన్నిసువు శిశుక్రీడా వినోదంబులం బొద్దులు పుచ్చుచుండె. అప్పుడేకదా దేవలోకంబున నమరనాథుమోల నిన్నరనాథు నిత్యసత్యతం గుఱిచి కౌశికునకును నాకునుం బెద్దవివాదంబయ్యె." అని చెప్పిన వసిష్ఠునిం జూచి సత్యకీర్తి "మునివరా! మీయనుగ్రహంబునఁ జంద్రమతి పూర్వచరిత్రంబు సాంతంబుగా నెఱింగితి. ధన్యుఁడనైతి; నింక నొక్క సంశయంబు కలదు. విశ్వామిత్రుండీ విశ్వంభరాధీశునకుం దన తపఃఫలంబులోని సగభాగ మొసంగి సమాధానంబు సేయుటకుం దన ప్రతిన కాక వేరొండు విశేష కారణముండెనా యానతీఁగోరెద" నని యడుగ, వసిష్ఠుం డిట్లనె.

"పూర్వము సర్వజిన్నామకుండగు రక్షోనాయకుండు తనపేరు సార్థకముగా సర్వలోకంబుల జయింపఁ దలంపుతో నిలింపగిరికరిగి యత్యంతనిష్ఠమెయి శంకరుం గుఱిచి యుగ్రతపంబొనరింప నద్దేవుఁడు సాక్షాత్కరించి కోరిన వరంబొసంగె. అంత నారక్షోదక్షుం డాత్మసదృశులగు క్షుద్రరాక్షసులతోడం గూడి సూయాణంబులు వెడలి బిడౌజఃప్రముఖులగు హరిత్పు

తులనిర్జించి యంతం దనివిసనక శాంతారణ్యంబులం జొచ్చి
మునులంబట్టి బాధించియుఁ బుణ్యాత్ముల మట్టు వెట్టియుఁ
గ్రూరుండై జనస్థానంబు నివాసస్థానంబుగా దుష్పరిపాలనంబు
సేయుచుండ వానిబాధలకుఁ దాళలేక మునులందఱు నొండొరుఁ
గూడి వానిఁబరిమార్చు విధానంబారయుచుఁ దుదకు నపర
పరమేష్ఠియగు కుశికనందనుం బరికొల్పుట కర్తవ్యంబుగా
నిర్ణయించి యవ్వాచంయముని యాశ్రమంబునకుం జని యాత
నిచే సత్కృతులయి "మునీంద్రా! సర్వజిత్తు మత్తిల్లి జగం
బుల బాధింపఁజొచ్చె. ఎట్టులేని వాని మట్టుపఱతమన్న హరవర
బలంబునం జేసి పరస్త్రీరతుండును గ్రూర కార్య నిర్వ
హణదక్షుండు నగు నరపాలునిచేఁ గాని వానికి మరణంబు
లేదు. అట్టివాఁడెవ్వఁడా యని యాలోచింప నవంతీ
నాయకుం డగు నీలలోహితుం డొకండ యున్నవాఁడు.
వాఁడును నయ్యసురునకుం బరమాప్తుండై యున్నవాఁడు.
అయినను నీలలోహితుండు నీకుం బరమభక్తుండుకదా? ఎట్టు
లేని నయ్యమరారియెడ వానికి వైరంబుపుట్టించి సర్వజిత్తుం
జంపించుట నీకు సులభంబని యెంచి నిను వేడవచ్చితిమి.
మామాట గీటునంబుచ్చక దుష్టుని శిక్షింపఁగడంగుము" అని
ప్రార్థించుటయు విశ్వామిత్రుండు మిత్రభేదంబునకు మనసు
గొలుపక కొంతవడి యాలోచించి కడకెట్టులేని సాధురక్షణం
బవశ్యకరణీయంబుగా నెంచి, మునులఁ బోఁబంచి యవంతీ
నాథుకడకుం జని వానిచే నుచితగౌరవంబంది వానిచే వచ్చిన

పని నెరవేరుతు ననిపించుకొని 'ధరిత్రీరమణా! రాజుల కాశ్రి
తాభీష్టప్రదానమే ముఖ్యముకదా? నీయెడ నయ్యది సుప్ర
సిద్ధంబ. రాజలక్షణంబులన్నియుఁ గలిగిన నీయందుఁ బర
దారాసక్తుండను నింద పొందుపడి యున్నయది. దానిం దొలఁ
గించుపొంటె నేనుపదేశించు మహాత్కార్యం బొనర్పుము.
ఆడినమాట తప్పకుము. మిత్రుఁడంగాన నాకోరిక నెరవేరుప
నీకుం గర్తవ్యంబ" అనిన నీలలోహితుండు "అయ్యా! తమ
యభీష్టంబెద్దియో సందేహింపక సెలవిండు" అన నమ్ముని
"మఱేమియుంగాదు, సర్వజిత్తుం దునిమి జగంబులరక్షించుటయే
నాకోరిక" యనె. రాజందులకు మనసొప్పమి "నో ముని
మిత్రమా! మీావలెనే సర్వజిత్తును నాకు మిత్రుండ. మిత్ర
ద్రోహంబునకు మించిన పాపంబుకలదే?" యన విశ్వామిత్రుండు
"మిత్రత్వామిత్రత్వంబులు సుజనుపట్ల నాలోచింపందగుంగాని
దుర్జనునియెడఁ బనిలేదు. కాన దీనికొడంబడుమనియు దీన
నీకు శ్రేయంబగుననియు నెన్నియోనీతు లుపదేశింప, రాజు
"మునిముఖ్యా! మీాయానతి కాదననయితి కాదుగదా?
అట్లచేసెదంగాని నాకుం బారితోషికంబుగా సప్తద్వీపాధి
పత్యంబు కృపసేయుఁ" డనుడును, గాధేయుం "డోయీ!
నీయభీప్సితం బీపుట్టువునం గాదుగాని యింకొకజన్మంబునఁ
ద్రిశంకునకుం దనూజుండవగుదువు. హరిశ్చంద్రనామంబున
నొప్పు నీకప్పుడు చిరకాలసమార్జితంబగు నాతపఃఫలంబులోని
యర్ధభాగంబొసంగి తేజోవంతుండవగు నీచే నేడుదీవుల నేలిం

తును" అనిచెప్పి యొప్పించి పెక్కు దివ్యాస్త్రంబు లుపదే శించి వెడలి చనె.

నీలలోహితుండును సైనికనికాయంబులతో నంచితం బగు మూరుతంబున దాడివెడలి కతిపయప్రయాణంబుల జన స్థానంబు దరిసి విడిసి భేరిమ్రోయించె. చారులవలని నింతయు నాలించిన సర్వజిత్తు రాక్షసబలంబులఁగూడి యెదురుకొనె; నప్పు డుభయబలంబులు ఘోరంబుగాఁ బోరి నిరవశేషంబుగా మడిసినఁ జూచి నరాశరనాయకు లొండొరులఁ దారసిల్లిరి. అప్పుడు సర్వజిత్తుండు క్రుద్ధుండై నీలలోహితుం గాంచి, "ఓరీ ద్రోహి! బూటకపుం బోడలమాటలకు లోనై నాచెలికారము వీడితివి. ఇఁక నీవు మృతుండవుగా దలంపుము" అని రౌద్రం బుగాఁ బలికి నిశితసాయకంబులు నిగుడింప నాతండును గఱకుం గోలకలు వరగించె. కొంతసేపిట్లు పోరాడి దివ్యాస్త్రంబు లుపయోగించి పోరుచో నీలలోహితుండు బ్రహ్మాస్త్రం బుప యోగించి సర్వజిత్తుం జక్కాడె. ఆకసంబునుండి నీలలోహి తునిపై గుసుమవర్షంబు గురిసె. విశ్వామిత్రుం డయ్యెడ నయ్యోధ్యయనిం జేరి కడుంగారవించి తనతపఃప్రభావంబున నాతని సైనికులఁ బునర్జీవితులఁ జేసె. అనంతరంబ యయ్యనంతా ధీశుండు నిరుపమానతేజస్వియై సపరివారంబుగాఁ దన పురంబునకుం బోయి కలకంధరంగూడి సకలసుఖంబు లనుభ వించుచుండె. కావున నిప్పుట్టువున హరిశ్చంద్రుఁడైన నీల లోహితునకు విశ్వామిత్రుం డాత్మీయతపఃఫలంబున నగంబీవల

సినవాఁడవ్యో" నని చెప్పిన బ్రహ్మపుత్త్రుం గనుంగొని సత్యకీర్తి "మునివరా! లోహితాస్యుం దక్షకుండు గఱచి చంపుట కేమి హేతువో తెలియఁగోరెద"నన వసిష్ఠుఁడిట్లు చెప్పందొడంగె. "పూర్వమొకప్పుడు తక్షకుండు తనపుత్త్రుఁడు వెంటరా నమర పురికిం జనుచు మధ్యేమార్గంబున నలకాపురంబు సొచ్చె. అన్నాగకుమారుం డలకావైభవముం జూడఁ జరించుచు రంభాగృహంబునకుం బోవు నలకూబరుని మార్గంబున కడ్డం బుగాఁ బరచె.

అదిచూచి కౌబేరిపాము దారికడ్డంబగుట దుశ్శకునం బని ఖడ్గంబున వానినఱికి చనె. కుమారుని విడిచి యమరా వతికి ముందు సనిన తక్షకుండు నారదునివలనఁ దనకుమారుని మరణంబు విని వాపోయి యలకాపురంబునకుం జని మడిసిన కొడుకుఁ బొడఁగని శోకించి కొంతవడికిఁ గోపంబుకదుర "గాలిగ్రోలి జీవించు నిష్పాఁప పాపని జాలిమాలి కరవాలు పాలుచేసిన పాలసుఁడు మనుజుఁడైపుట్టి నాచేఁ గఱవంబడి మడిసెడుంగాత" మని శపించె. ఇంద్రునివలనఁ దాఁబడసిన సంజీవమణి మహత్త్వంబునఁ గుమారుం బ్రదికించుకొని యథేచ్ఛం జనె. నలకూబరుం డాసంగతిఁ దెలిసి తనవలపు లాడి యగు రంభకుం జెలియగు మేనకకుం బ్రియుం డగుటం జేసి విశ్వామిత్త్రుండు తన్నుం గాపాడునని యెంచి యమ్మునిపాలికిం బోయి కృతాంజలియై తనకుఁ గలుగంబోవు కష్టంబుఁ దొలఁగింపుఁడని ప్రార్థింప నజ్జడదారి "యోయీ!

యాబిలేశయుశాపంబువలని భయంబు నిన్ను నొంపనేరదు. నీయంశంబున నొక్కమానవుండు భూలోకంబున హరిశ్చంద్రు నికిం గుమారుండై జనియించి తక్షకునిచే దష్టుండై మడిసి కడుంగడుఁ బుణ్యాత్ములగు జననీజనకుల పుణ్యవశంబునం బునర్జీవితుండయి బహుకాలంబు ధరాపాలనంబుసేయు. వగపుడిగి వెడలు" మని యనుగ్రహించె. అందువలన లోహితాస్యుండు నలకూబరాంశంబునం బుట్టి తక్షకుఁడు గఱవం బొడవడంగి పునర్జీవితుండయ్యె" నని యరుంధతీప్రియుండు వలుక సత్యకీర్తి యత్యంతాశ్చర్యంబు నొంది "గురుశేఖరా! మాధరావరుని దాసునిఁగానేలిన చండాలుని వృత్తాంతంబు వినంగోరెద" నన నవ్వుచు వసిష్ఠుండిట్లు చెప్పందొడంగె. "మన హరిశ్చంద్రుని జనకుండగు సత్యవ్రతుం డొకనాఁడు ననుం బ్రాపించి యీదేహంబుతోడ స్వర్గమునకుంబోవ ననువగు యాగంబు తనచేఁ జేయింపుమని ప్రార్థింప నేనది పొసఁగ నేరదంటిని. అందుపై నతఁడు కోపించి ననుం దూలనాడె. నేనుం గనలి కొలఁదిమెఱుంగక కొఱగాని మాటలాడితివి కావునఁ జండాలుండవగుమని శపించితి; నంత నమ్మానవపతి మాలతనంబు మేన నలమికొనఁ గాశికుం జేరి కులగోత్రములఁ దెలుపుకొని 'మునీంద్రా! వసిష్ఠుని యాగ్రహంబునఁ జండాలుఁడనైతిని. కరుణించి నాకలోకంబున కేగుదారి నాకుం జూపవే' యని కడచిన వృత్తాంతంబు సాంతంబుగా విన్నవింప గాధేయుం "డోయీ, నిన్నిట్లుచేసిన నీగురుం డుకుకునట్లు

నిన్నీ బొందెతో బృందారకలోకంబునకుం బంపెదఁ బొ”
మ్మని యొకమంత్రము పదేశించె. అద్దాని మహిమంబున
నమ్మహీపతి విహాయసంబున కెగసి సురపురద్వారంబు సారం
బోవ నంతకుమున్న మఘవానుం జూడవచ్చిన యంతకుం
డందుండి యెవ్వఁడీ మానవుఁడు? సురపురంబు సొరఁబడు
చున్నాఁడని తనకింకరులచే నతనిఁ దలక్రిందుగా నిలఁబడఁ
దోయించె. పుడమికిఁ బడుచున్న త్రిశంకుం “హా గాధేయా!
ననుంగావవే” యని పెద్దపెట్టు మొఱవెట్ట నక్కౌశికుం డక్క
య్యాలించి క్రోధదీపితుండయి “ఇలాపాలా! నేలంబడ
నీకేల? తారాపథంబున నిలువుము. నీవున్నచోటనే స్వర్గము
సృజింతు”నని తన తపోమహత్వంబునం బ్రతిస్వర్గంబు సృజించు
చుండఁ బరమేష్ఠి వరతెంచి యయ్యపరపరమేష్ఠి ననునయించి
యప్పటికి సృజింపఁబడిన యమరులు పరివేష్టింప నన్నరపతి
నిలిచినచోటునకుం ద్రిశంకు స్వర్గప్రసిద్ధి కలుగునట్లను
గ్రహించి కౌశికుని యాగ్రహంబుడిపి వెడలె. నాఁటంగోలె
నేటికిని విశ్వామిత్రు మహిమం బ్రకటించుచుఁ ద్రిశంకుఁ డాక
సంబునఁ గానగుచున్నాఁడు. మునియు నంతఁ దనియక నర
పతిం ద్రిదివనంబునుండి గెంటించిన పితృపతిం జండాలుండవై
జనియింపుమని శపించి యడుగులంబడి కడునడలు నతనిం గరు
ణించి “నాతిట్టు తిరుగనేరదు. కాని చండాలుండవై నాకుం
బ్రియంబొనరించి శాపవిముక్తుండవగు” మని యనుగ్రహించె.
అక్కతంబున నంతకుండు చండాలకులంబున వీరసేనునికిఁ

గొడుకై వీరబాహు నామధేయముతో హరిశ్చంద్రుఁ నూడి గీనిగాఁ గొనిమె" నని చెప్పిన మునివరుం జూచి సత్యకీర్తి "త్రికాలజ్ఞా! కాలకౌశికుని యుదంతంబుఁ గూడ దెలుపవే" యని వేడికొన సంయమీంద్రుం డిట్లు చెప్పం దొడంగె.

"పూర్వకాలమునందు ద్వాదశసూర్యులలో నొకండగు మిత్రుం డనువాఁడు త్వష్టయనువాని పుత్రిని సంజ్ఞను బెండ్లి యాడి దానివలన మనువును, యముఁడును నను నిద్దఱఁ గుమారులం గని యానంద సాగరమున నోలలాడుచుం బొద్దులఁ గడపుచుండ, సంజ్ఞ సూర్యుని వేడిమి సహింపఁ జాలక పుట్టినింటికిం బోఁ దలంపిడి తనచాయ నొక్క చానం జేసి పతిసుతులఁ బరికింపఁ జాలించి మగనికిం జెప్పకయ వెడలి చనె. ఛాయయు దానితరయని పతికిఁ దెలియరాని చందంబున మెలఁగుచుఁ గొంత కాలంబునకు సావర్ణ శనైశ్చరులను పుత్రులం బడసి సవతిబిడ్డల నీచంబుగాఁ జూచుచుండ సహింపక యముండు దానిం గాలఁదాచిన నాపె కినిసి యముని కాలు విఱుగునట్లు శపించె. దాని నంతయుఁ దెలిసి భానుండు "ఇది నిజముగ సంజ్ఞయైనచోఁ గన్నకొడుకు నిట్లు శపించునా? దీని కలరూపెఱుంగవలయు" నని తలఁపోసి ఛాయాజాయం గశాఘాతంబుల దండింప నాపె తాఁ జాయననియు సంజ్ఞ యొండేనియుం బోయెననియు నెఱిఁగించె. అంత సూర్యుం డాత్మపత్నిని వెదకికొనుచుం బోయి కురుక్షేత్రంబున నొక వనంబునందుం దురంగియై చరించు సంజ్ఞను దురంగరూపంబు

నం గూడి యమడలఁగని, నిజరూపంబును వహించిన జాయం దోడుకొని దివంబున కరిగె. అక్కవలు దేవవైద్యులై యశ్వి నులన వెలయుచుండిరి. సంజ్ఞాదేవి తన బిడ్డల కహితంబొనర్చిన ఛాయపై నీసునంజేసి దానిసుతు శనైశ్చరు నేలపైఁ బడఁ దోయింప నతండు నైమిశారణ్యంబునం బడి కాలు తునింగి పడ గుంటివాడై యందు దపంబు సేయుచున్న విశ్వామిత్రుం జేరి యతనిచే సకల మంత్ర రహస్యంబు లుపదేశంబు నొంది చాలకాలంబు నిరాహారుండయి తపంబుసేసి గ్రహస్థానం బలంకరించె. కావున గురుని గౌరవింపను, విశ్వాసంబు సూపిం పను, శనైశ్చరుండు కాలకౌశికుండయి కౌశికునకుం బ్రియంబు సేసె" నని విరించి తనయుండగు వసిష్ఠుండు తెలియఁజెప్పిన విని సత్యకీర్తి యత్యానంద భరితుండయి యమ్మునిచంద్రుని ముఖు నతిభక్తిం బూజించి "మహామతీ! మీ యనుగ్రహం బున నా సందియంబులెల్లఁ దీఱెఁ గృతార్థుండనైతి" నని నమ స్కరించె. వసిష్ఠుఁడును నాత్మీయ వృత్తాంతాకర్ణనంబున నాశ్చర్యావిష్టులగు హరిశ్చంద్రాదుల వీడ్కొని తనయాశ్ర మంబున కశ్రమంబునం జనె. సత్య హరిశ్చంద్రుఁడును సత్యకీర్తి సాయంబున సర్వజనానురంజకంబుగా ధరావలయంబేలుచుఁ జిరకాలంబు సుఖంబుండె.

---

# అనుబంధము ౧.

# నానాటకము.

వ్యాసకర్త:

తాళ్లూరి సుబ్బారావుగారు, F. A. U.,

ఏలూరు.

*(Reproduced from Bharati with the kind permission of the author.)*

౧



నేనొక కవిని, పండితుణ్ణి. ఈకాలంలో కవి కాని వాడెవ్వడు; అందరు కవులంటారేమో. ఆ మాట నిజమే కాని, అందులోకూడ కొన్ని మంచిచెడ్డలున్నాయని తలచే వారిలో నేనొకణ్ణి. అందరు చిల్లరకవులతో పాటు నన్ను తీసివేయడానికి వీలు లేదు మరి. ఉభయభాషల్లో పండి తాళ్ళూరి సుబ్బారావు గారు, F. A. U. తుణ్ణి కావ్యాలు చదివాను. వ్యాకరణము చదివాను. ఛందశ్శాస్త్రము క్షుణ్ణముగా ఏకరువుబెట్టాను. కవిత్వంలోకూడ అచ్చటచ్చట ఆశువుచెప్పి మెప్పొందాను. అనాదినుండి మమ్ములను గురువులుగా పూజించుచుండిన వర్తకశిఖామణియగు పోలిశెట్టిగారు నా ఆశువునకు, కవిత్వపటుత్వమునకు మెచ్చి మొన్న మొన్న జరిగిన వారి చిన్నబ్బాయి అక్షరాభ్యాససమయమున

సువర్ణకంకణ మిచ్చి బహూకరించినారు. పుస్తకాల కంపెనీ లకు బాలుర కుపయుక్తముగ సులభశైలిని మృదుమధు రముగ పఠనీయగ్రంథములను రెండుదినముల కొక్కటి చొప్పున వ్రాసియిచ్చాను. ఇల్లాంటివి యింకా చాలా వున్నా యిలెండి. చెప్పడానికి మచ్చునకు మాత్రము ఒకటి రెండు చెప్పాను. ప్రస్తుతంలో ఇల్లా అనేకవిధములుగా భాషాసేవ చేస్తూ, చదువుకొన్న వాణ్ణి గనుక ఊరకుండలేక, 'కావ్యాంతే నాటకం' అని పెద్ద లన్నారు గనుక, నాటక మొకటి వ్రాసి నచో అక్కడికి సంపూర్తియగునని తలచి మన నవనాగరికు లకు నచ్చేలాగున అన్నిరసములను పోషించుచు నాటక మొకటి వ్రాశాను. నాటకం వ్రాయడం అంటె తెలియని కొందరి అభిప్రాయం కాని మంచినాటకం వ్రాయాలంటె పేగులు తెగిపోతాయి. ఎన్ని వుంటే నాటక మవుతుంది. ఆరు మాసాలు నిద్రాహారాలు లేక కష్టపడి పూర్తిచేశాను. కాని యేమిలాభం. నేను చదువుకొని ఆనందించడమేకాని నలుగురు చూడడానికి వినడానికి ఆనందించడానికి వీలు దొరకడం లేదు. నలుగురూ ఆనందించి రసము గ్రహించుట కంటె కవికి కావ లసిన దేమి ? ఓదార్చేవాళ్లు లేనప్పుడు ఎంతయేడ్చినా లాభం లేనట్లు ఆనందించేఅవకాశం లేనప్పుడు కవి ఏమివ్రాస్తే యేమి ప్రయోజనము. అందుచేత నామిత్రులసలహా ననుసరించి దీనిని యేలాగైనా ప్రదర్శనమునకు తేవలెనని యిప్పటికి దాదాపుగ రెండుమాసములనుండి నేను పడుచున్న పాట్లు వర్ణింప నలవి

కాదు. ఏక్టరన్నవాడి నెల్ల ఆశ్రయించాను. రంగరత్నములు, నాటకసింహములు, నాటకోద్ధారకులు,మార్తాండులు, కళోద్ధారకులు ఇత్యాదిబిరుదాంకితుల మాటల నికచెప్పనేల? వీరిసేవ చేయలేక, చుట్టూ తిరగలేక, ప్రాణాలు విసికిపోయినాయి. అయినా అభిలాష పోలేదు. ఇంకా సాధిద్దామనే వుంది మనసులో. యేకంపెనీవారికో యిచ్చి ప్రదర్శింపచేద్దామంటె కంపెనీ వుంటుందో వూడుతుందో తెలియదు. మఖలో పుట్టి పుబ్బలో మాడేటట్లు చిత్రవిచిత్రాల నామాలతో నాటక సంఘాలు తెల్లవారక మునుపే వీధిగోడలమీద వెలుస్తున్నాయి. నాటకమైన మర్నాడు మటుమాయమై పోతున్నాయి. నోటీసులు అచ్చువేసిన అచ్చాఫీసువారు డబ్బుకై రిజష్టరీ నోటీసు యివ్వగా యిట్టిపేరుగల కంపెనీ మావూరులో లేదని తిరుగురసీదులమీద వ్రాసి వచ్చుచున్న సంగతికూడా నే నెరుగుదును. ఇల్లాగ వేసినపేరుతో వేయక, ఆడిననాటక మాడక, వేసిన వూళ్లో వేయక, పేరులు మార్చి, తలలు మార్చి, రేట్లుమార్చి నాటకములు వేయుచున్న కంపెనీలకు యివ్వడానికి మనస్కరించడంలేదు. ఏదో ఒక కట్టుబాటు ననుసరించి జరుగుచున్న కంపెనీ కిద్దామని అభిలాష. అందుకే యిన్ని అగచాట్లు పడుచున్నాను. ఏలాగైనా యీ కంపెనీకి—పేరెందుకు లెండి—యిచ్చి ప్రదర్శింప జేసి ఆనందించాలని వుంది. యీకంపెనీలో సమర్థులైన ఏక్టర్లు వున్నారు. స్థావరంగా పనీ చేస్తూవుంది. శిక్షణజరగనిదే, బాగా నలగందే

నాటకం ప్రదర్శింపరట. మంచినాటక మైతేనే గాని ప్రదర్శిం
చడానికి ఆలోచనలోనే పెట్టరట. యింకా చాలాచాలా కట్టు
బాట్లురూల్సున్నాయట. అందుచేతయేలాగైనా యీకంపెనీ
వారికి నానాటక మిచ్చి ప్రదర్శింపజేయాలని దీక్షతో మూడు
రోజులనుండి యీహాలుచుట్టూ తిరుగుతున్నాను. కాని యింత
వరకు లోనికి ప్రవేశమే కలుగలేదు. రేపు రేపని గేటువద్ద
వున్న జవానుజవాబుతోనే సరిపోతోంది. లోనికి ప్రవేశమే
కలగడంలేదు. మేనేజరు దర్శనం అంతకంటె లేదు. యీరోజు
ప్రాప్తి యెట్లావుందో మరి మామూలు 'రేపే' అవునో, లేక
'ఆరేపు'నకు మరిరెండు తోపులే కలుగునో తెలియదు.

౨

షేకుదాలతుమియ్యా పెన్‌షన్ సిఫాయి. గేటువద్ద
చాలా జాగ్రత్తగా వుంటాడని యీయనను నియమించారు
కంపెనీవారు. మామూలుమాదిరిగా నేను గేటువద్దకు నా
గ్రంథము చంకలో పెట్టుకొని మేనేజరు దర్శనానికి వెళ్లాను.
సాయిబుగారికి నన్ను చూచినచూడడంతోటే జాలికలిగింది
కాబోలు, రోజూవచ్చి తిరిగిపోతూండడంచేత. సాహెబు—
"ఏమండీ! శాస్త్రుల్లుగారూ! మీకీ రోజూ వచ్చిపోతున్నారు.
మాకీ మిమ్ముల్ని చూస్తే జాలి వేస్తుంది. ఎందుకు వచ్చారో,
మీపని యేమిటో చెప్పితే ఆలోచనా చేస్తాము" అన్నాడు.

నాకర్మంకాలింది. వీడితో నాపని చెప్పితే వీడు ఆలో
చిస్తాడట. యేంకాలం వచ్చిందిరా బాబు. పూర్వం కవు

లోచ్చా రంటె మహామహులు, రాజాధిరాజులు, యెదురుగా వచ్చి సన్మానించి సగౌరవముగా పూజించేవారట. ఆహా కాలమహిమ! అప్పటికి యిప్పటికి యెంతవ్యత్యాస ముంది. ఈసాయెబుగారికి నాపని చెప్పవలెనట. రామ! రామ! అయినా చేయవలసిందీ లేదు. ఎంతటి వాడైనా కాలానికి కట్టుబడవలె నన్నారు పెద్దలు. నేను కార్యవాదిని గాని ఖడ్గ వాదిని గాను. నాకు పట్టుదలతో నిమిత్తం లేదు—అని మన సులో అనుకొని, "సాహెబుగారూ! నేను కవిని. చదువుకొన్న పండితుణ్ణి. చాలా కష్టపడి మంచినాటక మొకటి తయారు చేశాను. ఇది మీకంపెనీవారిచే ప్రదర్శింపచేయాలని సం కల్పించి మేనేజరు గారిదర్శనం చేయాలని తిరుగుతున్నాను" అన్నాను.

సాయెబు—"అల్లాగా! శాస్త్రుల్లు. చెప్పరు. ఏదండి మంచినాటకం వుంది. అందులో కొంత సదివి యినిపించండి మాకి. సూదాము. బాగుంటె మేము మీకి సాయంచేస్తాము. కూచోండి"—అన్నాడు.

ఈమాటలు వినేసరికి నా కెక్కడాలేని కోపంవచ్చింది. అయినా యేమి చేయగలను? తలతల కొట్టుకొన్నాను. పారాజవానువద్ద నాపాండిత్య ప్రకటన చేయవలసివచ్చిందిగదా అని దుఃఖించాను. వానికోరిక తీర్చకపోతే వీల్లేదు. నాభావి కర్తవ్యం వాడిమీద ఆధారపడి వుంది. కవిభాస్కరుడంతవాడు ద్వారపాలకుడైన సాహిణిమారుడికి రామాయణం అంకితం

యివ్వగాలేనిది నేను ఈద్వారపాలకుడికి చదివి వినిపించినంత మాత్రంచేత దోష మేమని సంతృప్తిచెందాను. పూజారి వర మిస్తే గాని దేముడు వర మివ్వడు అన్నారు. ఆత్మ గౌరవం చంపుకొని, స గ ము చ చ్చి, సా హే బు గా రు బెంచి మీద కూర్చుండగా ఆగేటువద్ద ఆయనకు యెదురుగా కూలబడి ఒకటిరెండురంగాలు చదివి వినిపించాను. 'ఇంకా చదవండి శాస్తుల్లూ చూద్దాం! అంటూ గడ్డంమీసం దువ్వు కొంటూన్నాడు. పూర్తిగా మునిగినవాడికి చలిలేదు. మానాభి మానాలు వదలుకొన్నవాడికి సిగ్గూలేదు. ఒకటిరెండు రంగ ములు చదివినవాడికి యింకొకటి రెండురంగములు చదువ కష్టం గనకనా? సాహెబుగారు వద్దనేవరకూ, పండ్లబిగితో, గ్రుక్క త్రిప్పుకొనకుండా చదివేశాను. అర్థంగాకో, లేక నావిసుగుదల అర్థంఅయ్యో చెప్పలేను గాని, "చాలండీ. బాగా వుందిగాని, మాలాటివాళ్ళకికూడా కొంచెం మ జా చే సే ట ట్టు గా వ్రాయాలి." అంటూ "మీరు యిక్కడ వుండండి. మేము తిరిగి వచ్చి మీకీ లోపలికి పంపుతా" మని చెప్పి వెళ్ళాడు లోపలికి.

బ్రతుకు జీవుడా ! ఇంతమాత్రంతో వదలిపెట్టాడు. ఇంకా పెద్దవిమర్శన మొ ద లు పె ట్టి, "మీరు యిలాగా వ్రాయండి. యీలా దిద్దుకోండి" అని అంటాడేమో అని, ప్రాణాలు యెగిరిపోయి నాయి. ఇల్లా యిర వైనిమిషాలు వోపిక బట్టి సాహెబుగారిరాక కెదురుచూస్తూ నిలవబడ్డాను. ఇంతలో

సాహెబువచ్చి, "మేనేజరుగారు యింకా రాలేదు. లోపల యాక్టర్లున్నారు. మీరు లోపలికి అభ్యంతరంగా వెళ్ళి ముందు వీళ్ళకి పట్టుకోండి. అక్కడ హీరో (hero) పాత్ర వేసుగొనే వాళ్ళ లగాయ్తు జవాను వేషం వేసేవాడివరకు వున్న గొప్ప యాక్టర్లున్నారు. వెళ్లండి" అన్నాడు. పూర్తిపని జరక్కపోయినా లోపల ప్రవేశం దొరికింది గదా అని సంతోషిస్తూ లోపల ప్రవేశించాను అనుమాన ఆశ్చర్యాలతో, కొత్త గనక.

3

హాలు చాలా విశాలంగా వుంది. చిన్న చిన్న గదులు కూడా చాలావున్నాయి. "మ్యానేజరు ఆఫీసు," "ప్రయివేటు" "కండక్టరు రూము," "యాక్టర్సుహాలు," "మిస్ ఇందుమణి" అంటూ వ్రాసినబోర్డులు గదిద్వారాలపైన అమర్చబడి వున్నాయి. నాకు చాలా ఆశ్చర్యం వేసింది. అంతా పాశ్చాత్య పద్ధతిలాగ కనబడ్డది. అందుచేత చాలా కట్టుదిట్టంగా పని చేస్తోంది కామోసు ననుకొన్నాను. ఇన్ని గదులున్నాయి. ఏగదిలోకి వెడితే యేమిచిక్కు వస్తుందో అని అనుకొని మెల్లగా యిటు అటూ చూస్తూ యాక్టర్లరూములోనికి వెళ్ళాను. అచ్చట సుమారు పదిమందివరకు వుంటారు. అందులో కొందరు పెద్దయాక్టర్లు కామల్ను. అయిదారుగురు చుట్టూ కూర్చొని పేకాట ఆడుతున్నారు. రకరకాలమనుష్యులు. వింతవింతజుట్లు. అందులో ఒకడికి అదేదో బుల్ డాగు

ప్రాపింగుట, యీమధ్య భారతిలో ప్రకటించారే అట్లాంటిది, వుంది. ఒకడికి సంపూర్ణంగా తలనిండా జుట్టు; స్త్రీవేషానికి పనికివచ్చేవా డనుకొన్నాను—మరివకడికి గిరజాలు, చెంప సగమువరకూ వెంట్రుకలే. ఒకడిది బట్టతల, మరివకనికి గుండు మధ్య జుట్టుపిలక. ఇట్లాగ ఒకరికి ఒకరుతీసిపోకుండా వున్నారు.

ఇంకా అక్కడ కాల్చి పారవేసిన సిగరెట్లు, బీడీలు, చుట్టలు లెక్కలేనన్ని వున్నాయి. మనదేశంలో వచ్చే అన్ని రకాల చుట్ట, బీడీ, సిగరెట్టుల సాంపిళ్ళు కావాలంటె అచ్చట దొరకగలవంటె అతిశయోక్తి గాజాలదు. అందులో, కొందరు నన్ను చూసి కామల్ను పేకాట ఆడుతూనే కూనిరాగాలు తీయడానికి మొదలు పెట్టారు—తాము గొప్పయాక్టర్లని నేననుకోవాలని కావల్ను. ఇక కబుర్లకి తక్కువ లేదు. డచ్చీలకు డాబులకి అంతు లేదు. యీవిధంగా కాలక్షేపం అయింది కొంతసేపు. కాని నన్నెవ్వరూ పలకరించా లేదు; కూర్చోండి అన్నపాపాన్నిఅన్నా పోలేదు. వాళ్ళ ఆటేమో, పాటేమో, కబుర్లేమో—అంతే. ఒకమూల కొంతమంది పిల్లలున్నారు. పాపం వాళ్ళు లోకువకాబోలు, వారికేదో పాటలు చెప్పుచూ పాడించుచున్నాడు హార్మోనిస్టు నోట సిగరెట్టుతో. ఈవిధంగా యీచిత్రాలన్నీ చూస్తూ వీరే కాబోలు నటకాగ్రేసరులు, అభినవనాట్య శిఖామణులు; లోకోద్ధరణమునకు నాటకరంగాలపై నభినయించి పండితపామరజనుల కాదర్శప్రాయులగు మహామహులు వీరే కాబోలు ననుకొన్నా నాలో నేను. ఇట్లా

అనుకొంటూ కొంతసేపు నిలబడ్డాను. ఇంతలో కేమేనేజరుగారు వచ్చారని ఎవరో చెప్పారు. ఆమాట వినేసరికి పేకాట ఆడు తున్నవారిలో ఒకడు లేచి ముక్కలను క్రిందపారేసి గభాలున వెళ్ళిపోయాడు. మిగతావారు మామూలుగానే కూర్చొనే వున్నారు. ఆవెళ్ళినవాడు తిరిగి చేతిలో ఓ జరీకండువా, ఓచేతిలో బెత్తం, చెప్పులుజోడు తీసికొనివచ్చి, "వీటిని మేనే జరు ప్రైవేటురూములో పెట్టి వస్తాను. ముక్కల్ని కలపండి" అని చెప్పి వెళ్ళిపోయాడు. యీదృశ్యం చూసేసరికి నా కాశ్చర్యం వేసింది. ఎందుకంటే వీడొక నౌకరనియు, మిగతా వాళ్ళు యాక్టర్లని నాకప్పుడు తెలిసింది. ఉచ్చనీచాలు లేక ఓ నౌకరుతో కలిసి పేకాట ఆడుతున్న నటకాగ్రేసరులను చూచి ఓవిధమైన రోత పుట్టింది. అయినా యిదో కంపెనీ రూలు కాబోలు ననుకొన్నా, గాంధీమహాత్ముడు సర్వమానవ సమానత్వం ప్రపంచానికి చాటుతున్నాడు కాబట్టి. మహా త్ముడి బోధల్లో ఏవి పట్టుబడక పోయినా యిందులో మాత్రం బాగా పట్టుబడి లోకానికి ఆదర్శప్రాయు లౌతున్నారని అను కొని, అచ్చట యెంతసేపున్నా లాభం లేదనుకొని మానేజరు గారి దర్శనం చేసుకొందామని బయటకు వచ్చాను. ఆయన ఆఫీసురూములో వుంటాడనుకొని గదులమీద బోర్డులను ఆధారం చేసుకొని ఒకగదిలో ప్రవేశించాను. లోనికి వెళ్ళేసరికి కొత్తమనిషిని గనుక యెగాదిగాయేకదమ్ముని అక్కడనున్న వా ళ్లంతా నావంక చూశారు. ఇదంతా నేను కనిపెట్టుతూనే

వున్నా. అంతలో ఒకరు "ఎవరండీ ? ఎవరికోసం వచ్చారు?" అనడంతోటే, "చిత్తం. మేనేజరుగారి దర్శనార్థం వచ్చాను" అని చెప్పాను. నాజవాబునకు తిరిగి యేవిధమైనప్రశ్నా రాలేదు. నే నల్లాగే నిలబడ్డాను గదిగుమ్మంలో.

ఇక గదిలోసంగతి మనవిచేస్తా. నామీదకోపంవద్దు. ఉన్నదున్నట్లు చెప్పుతాను. అది నిజమే అనుకోండి, వినోదమే అనుకోండి; ఎల్లా భావించినా సంతోషమే. గదిలో నలుగు రున్నారు. అంతా కంపెనీ పెద్దవుద్యోగస్థులులాగ కనబడ్డారు. ఇచ్చటకూడా పేకాట జోరుగా సాగుతోంది. కాని వెనక చూసిందానికి దీనికి వ్యత్యాసం వుంది. ఇక్కడ రవునుబల్ల. అంతా కుర్చీలమీద కూర్చున్నారు. ఆటకూడా పెద్దదిలాగే వుంది. మనిషికి మూడుముక్కలు, డబ్బు మధ్య ప్రోగుపడి, మహాజోరుగా సాగుతోంది ఆట. ఈజోరులో ఏమీ కనబడ్డం లేదు—వారిఆకేమో, వారేమో!! యిల్లాగా సుమారు అరగంటసేపు నిలబడ్డాను. ఈవిధంగా వుండగా అందులో ఓడు "శాస్త్రుర్లు గారూ! తాము పెద్దలు. తమకు పని చెప్ప కూడదు. చూడండి, ఆ ఆల్మేరాలో సీసాను, చిన్నగ్లాసూను వుంటుంది, యిల్లా యివ్వండి" అన్నాడు. కార్యవాదిని గనక, అనుగ్రహం సంపాదించాలి గనక, చిత్తం చిత్త మంటూ ఆల్మేరా తెరచి సీసాను, గ్లాసును తెచ్చి యిచ్చాను. సీసాపై లేబిలు చూసి, వుండవలసిన లక్షణా లన్నీ వున్నా యను కొన్నా నాలో నేనే. ఇంతలోనే అందులో ఒకడు, మానేజరు

కాబోలు "శాస్త్రుల్లుగారూ! తమరు రేపు యింటికి దయ చెయ్యండి. మాట్లాడుదా" మన్నాడు. చేసేది లేక చిత్తమని శెలవు తీసుకొని జరిగిందంతా తలుచుకుంటూ, అనేక భావాలతో త్రోవనే నాబసకు చేరుకోవాలనుకొన్నా నారోజుకి.

౪

"ఏమండీ, శా స్త్రు ల్లు గా రూ ! మీకి వచ్చినపని అయిందా" అంటూ ఎదురుపడ్డాడు సాహెబుసోదరుడు గేటు దగ్గరలో, నేను వెళ్లబోతుంటే. వాణ్ణి చూసేసరికి నావళ్లు భగ్గున మండింది. నీవారా యింత కట్టుదిట్టంగా వుంటానికి కారణం లోనిపేకాటగదరా అనుకొని, "అబ్బే యెక్కడిది? రేపు యింటివద్దకు రమ్మన్నారు మే నే జ రు గా రు. రేపు బహుశః నా కార్యం చక్కబడవచ్చు" అన్నాను. "అరే పాపం! నాకు చాలా విచారం వేస్తుంది శాస్త్రీ; కాని యింకా వకటి చెప్తాను. అది కూడా చేయండి, కష్టంలో కష్టం. ఏం చేస్తారు మరి. మాది కంపెనీలో నాయికాపాత్ర (Heroine) వేసేది ఆడది కాని మొగవాడు కాదు, అందరికంపెనీలలాగా. దానికి మీరు తప్పక చూడవాలా. మామేనేజరుగారిక్క అది అసక్కు. మిసస్ మేనేజరు. తెలిసిందా? వెళ్లండీ మీరు, చాలా ప్రొద్దుపోయింది పాపం" అని అన్నాడు. అప్పటున దారిలో జరిగిందంతా తలుచుకొంటూ, జరుగబోయేదానిని ఆలోచించుకొంటూ యింటికి వెళ్లాను. స్నానం వగైరాలు చేసుకొని, కొంతవిశ్రాంతి తీసుకొందామని, త్వరగా భోజ

సంచేసి ప్రక్కమీద పరుండేసరికి, "రేపు మేనేజరుగారి యింటికి వెళ్లుచున్నాము గదా! యీసాయంత్రమే మిసస్ మేనేజరుగార్ని చూచినట్టయితే మంచిదేమో! ఆలస్యం అమృతం విషం అన్నారు. 'ఈసాయంత్రమో రాత్రియో వారు కలసినప్పుడు ఒక్కమాట చెప్పితే రేపు కార్యసానుకూలం కావచ్చు"నని తటాలున మనస్సుకు తట్టింది. అంత విశ్రాంతికి స్వస్తిచెప్పి తిరిగి బయలుదేరాను బజారునకు, చంకలోగ్రంధం వుంచుకొని. రిక్తహస్తములతో పోవుట మంచిది కాదని పండ్లు కనబడితే బజారులో కొన్ని కొని తిన్నగా యిందుమణిగారియింటికి వెళ్లాను. నారాక దాసీవల్ల తెలియజేశాను. లోపలికి రావచ్చునని శెలవయిందని దాసీవల్ల తెలియవచ్చింది. అంత లోనికి వెళ్లి వెంట తీసుకువెళ్లిన ఫలములను అమ్మగారివద్ద నుంచి అతి వినయవిధేయతలతో నావచ్చినకార్యం నివేదించాను. వెంటనే ఆమె "కూర్చోండి" అని ఒక కుర్చీని చూపించి మర్యాదగా మాట్లాడింది. అందువల్ల నాకు చాలా ఆనందమూ కలిగింది. చదువుకొని మా కన్నిమర్యాదలూ తెలుసుననే పురుషులకంటె ఈస్త్రీయే యుత్తమురాలని తోచింది. నిజంగా మన స్త్రీలవలననే మనమర్యాదలు, మంచిచెడ్డలు యింతవరకు నిలబడుతున్నాయి. మంచికీ చెడ్డకీ కూడా స్త్రీయే కారకురాలన్నమాట వేదాక్షరం. ఆమె నన్నెంతో గౌరవించి తప్పక తాను నాకు సహాయము చేయుదుననియు, రేపు

మేనేజరుగారిని చూడవలసిందనియు, తాను యీరాత్రి యీ విషయమై మేనేజరు గారితో మాట్లాడెద ననియు చెప్పి తాంబూలమిచ్చి నమస్కరించింది. చిత్తమని శెలవుపుచ్చుకొని నాకార్యం నెరవేరుట కభ్యంతరం లేదని నాలో ననుకొని సంతోషిస్తూ యింటికి వచ్చాను.

ఆరాత్రి సుఖంగా నిద్రపట్టలేదు. ఎప్పుడు తెల్లవారుతుందో, యెప్పుడు మేనేజరుగారియింటికి వెడ్తానో అన్న ఆలోచనలతోనే సరిపోయింది. ఈఆలోచన్లలో యెప్పుడు నిద్ర పట్టిందో యెఱుగను కాని, వుదయం సుమారు, యెనిమిది గంటలకు మెళుకూ వచ్చింది. ఆలస్యంగా లేచినందుకు కంగారుపడుతూ, విసుగుకొంటూ, పెందలకడనే లేపనందుకు భార్యను కసరుకొంటూ, కాలకృత్యాలు దీర్చుకొని భోజనం చేసి దుస్తులను ధరించి చేతితో పుస్తకం పట్టుకొని మేనేజరు గారి యింటికి వెళ్ళాను. మేనేజరుగారుకూడా భోంచేసి విశ్రాంతిగా పడకకుర్చీలో కూర్చొని తాంబూలం వేసుకొంటూ నారాక చూచి నన్నుకూడా కూర్చోమని శెలవిచ్చారు. కొంత వరకూ నామంచిచెడ్డలను దర్యాప్తుచెయ్యడంలో గడచింది. అంతట నాపని వారితో చెప్పుకొన్నాను. అంతా విని, "అల్లాగా! యేది చదవండి పుస్తకం విందాము" అని శెల విచ్చారు మేనేజరుగారు. అన్నదే చాలుగదా అని నాగ్రంథం విప్పి చదవడం మొదలుపెట్టాను. నేను చదవడం ఆయన కొంతవరకు "ఊ" కొట్టుట జరిగింది. మేనేజరుగారు శ్రద్ధగా

వింటున్నారుగదా అని నేనుచదువుతూ సేవున్నాను. ఇట్లా కొంత సేపు జరిగింది. తరువాత ఆ 'ఊ' శబ్ద మాగిపోయి ఆస్థాన మును 'గుర్రుగుర్రు' శబ్ద మాక్రమించినది. తల పైకెత్తి చూచాను. ఏమిచెప్పమంటారు! మేనేజరుగారికి శరీరస్మారకం లేదు. మహానిద్రలో ఉన్నారు. ఆదృశ్యంచూచి ఓ పెద్ద నిట్టూర్పు విడిచాను. ఇంతవరకూ వృథాగా చదివాను. నాశ్ర మంతా అరణ్యరోదన మయింది. చాలా బాగుంది మర్యాద! ఈమాత్రానికి నన్నెందుకు చదవమనాలి అనుకొని గ్రంథం మూసి కూర్చొన్నా, ఆయన నిద్రపోతోంటే నేను చూస్తూ. ఇల్లా రెండుమూడుగంట లైనతరువాత మేనేజరుగారు లేచారు. లేస్తూ నేనా వైపుచూచి, "బాగుంది మీనాటకం. దయచేసి ఆ పుస్తకం యీబల్లమీద వుంచి మీరు వెళ్ళండి. తప్పకుండా ప్రదర్శించడాని కేర్పాటుచేస్తాను. మీరు రెండుమాసములైన తర్వాత రండి" అని శెలవిచ్చారు. చిత్తమని వారు చెప్పినట్లు బల్లమీద పుస్తక ముంచి శెలవు తీసుకొన్నా. విన్నా వినక పోయినా బాగుందనియు, ప్రదర్శింపచేస్తాననియు శెల విచ్చాడు, నా కంతే చాలును. భగవంతుడి దయవల్లనో, మిసెస్ మేనేజరుగారి అనుగ్రహంవల్లనో నాకార్యం నెరవేరిం దని సంతోషిస్తూ యింటికి వెళ్ళాను.

దిన మొకయుగంగా గడిపాను. ఎప్పుడు రెండునెల్లు అవుతాయా, యెప్పుడు నానాటకం ప్రదర్శింప బడుతుందా అని అని ఉవ్విళ్ళూర్తూ రోజులు వెళ్ళబుచ్చాను. కష్టప

నిద్రాహారములు లేక వ్రాసినందుకు కన్నులపండుగగా చూచి ఆనందించెడి భాగ్యం యెన్నడబ్బునా అని తహతహపడ్డాను. ఈవిధంగా ఓపికపట్టి కాలం గడిపి ఆఖరుకు బయలుదేరాను మేనేజరుగారి దర్శనానికి. హాలువద్దకువెళ్లి గేటుదగ్గర నిల్చుని నౌకరుచేత "ఏమోయి, మేనేజరుగారితో చెప్పు, కవిగారు వచ్చారని" అన్నాను, యేమో మేనేజరుగారువచ్చి గొప్ప మర్యాదతో లోనికి తీసుకువెళ్లుతారనే ఊహతో. నౌకరు లోనికి వెళ్లి తిరిగి వచ్చి, "కవీలేదు, గివీలేదు, వెళ్లు. యిక్కడ వుండడానికి వీలు లేదు వెళ్లిపో. లేకపోతే త్రోసివేయవలసి వస్తుంది" అన్నాడు. ఈమాటలు వినేసరికి నా కెక్కడాలేని కోపం వచ్చింది.—"ఆ" అన్నాను.- " 'ఆ' లేదు, 'ఊ' లేదు వెళ్లవయ్యా" అన్నాడు నౌకరు. ఆపాటున యేమి చెయ్యనూ తోచిందికాదు. ఉచ్చనీచము లెఱుంగనివానితో పోట్లాడి యేమిలాభం. ఇంతకూ బుద్ధిపొరబాటు నాదనుకొని లెంపలు వేసుకొని యివతలకు వచ్చి హాలుగోడమీద చూతుగదా! ఒక పెద్ద కరపత్రము (wall poster) అతికింపబడి వుంది. అందులో యిట్లా వుంది—

'త్వరలో ప్రదర్శింపబడును. ఆరంభదినమునకై వేచి ఉండుడు—

గొ ప్ప నా ట క రా జ ము.

నాటకరంగమునందును, నటనాకౌశల్యమునందును మెప్పువడసి అనేక సువర్ణపతకములను, కంకణములను బహు

మానము లందిన యీనాటకసంఘపు మేనేజరు మ-రా-రా-(శ్రీ)..........................గారిచే స్వయముగ రచింపబడిన

# చిత్ర

అను నాటకము అతిచిత్రవిచిత్రముగ త్వరలో ప్రదర్శింపబడును."

అన్నీ పెద్ద అక్షరములుగా ప్రచురింపబడి యున్నది. అది చూసేసరికి నాప్రాణాలు నిలువునా పోయాంయి. కన్నుల నుండి వేడినీళ్లు జొటజొట రాలాంయి. ఎంత పనిచేశాడురా యీమేనేజరు అనుకొన్నా.. చిత్రముగా 'చిత్ర' నాటకము నకు నాపేరు వూరు లేకుండా తానే స్వయంగా రచించా డుట. అవురా కాలమహిమ! ఇంత చిత్రం యీప్రపంచంలో జరుగుతుం దనుకోలేదు. ఇంకా చేసే దేమున్నది ? నెత్తిని గుడ్డ వేసికొని తూర్పుగా తిరిగి ఒకదణ్ణం పెట్టి అలో, లక్ష్మణా యని యింటికి తిరిగాను. నాదంటే నాది నేను వ్రాశానంటే నేను వ్రాశానని శిఖపట్లు జరగాలి. కోర్టులో దావా వేయాలి. నాకేమి సాక్ష్యమా, చట్టుబండలా ? ఇంతకంటె సిగ్గుమాలినపని వేరే వుందా ? కోర్టులో మట్టుకు న్యాయం దొరుకుతుంది గనకనా? డబ్బున్నవాడికి కోర్టుగాని నాబోటి నిరుపేదకు కోర్టు యేంలాభం అని నిరాశ జేసుకొని వూరు కున్నాను. నాసోదరకవులు యిట్లా జరుగుతుందా లని శంకించి చప్పుళింపక యికముందు జాగ్రత్తగా నుండా లనుకొంటే నా 'చిత్ర' చరిత్రం వ్రాసినందుకు నేను ధన్యుణ్ణి అవుతాను.

---

# అనుబంధము ౨.

# ఎంతచదువుకుంటేనేం?

వ్యాసకర్త:

తాండ్ర వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

ఏలూరు.

౧

సరోజకిప్పుడు పద్దెనిమిదోయేడు. స్కూల్ ఫైనలు పరీక్ష ప్యాసయిందగ్గర్నుంచీ కళ్ళకి చలువ అద్దాలు, కాళ్ళకి కలకత్తాశాండల్సు కావలసివచ్చాయి. తన సహజ సుందర మధురమోహన వదన మండలానికీ సులోచనాలందమా అని గర్వపడేదే అప్పుడప్పుడు. ఎల్లాగయినా చదువుకుందికదూ. 'వేణీభరపుసొంపు' అని వెర్రికవీశ్వరుల వర్ణనలలోవలె కొంచెం సేపు మిస్ సులోచన జుట్టుకట్టు అని, కాసేపు గోహార్ పద్ధతనీ రిబ్బన్సుకట్టి రకరకాలగా దువ్వేది. పచ్చని ఆముఖంమీదికి తుమ్మెదరెక్కల్లాగ ముంగురులు మురిపిస్తున్నాయి. సాయం కాలం అయ్యేసరికి టెన్నిసు బ్యాటుతో, నవీనసర్వాలంకారా లతో, సముద్రతీరానికి-లేకపోతే క్లబ్బుకి-ఏసినిమాకో వెళ్ళు తుండేది- ఇంతకీ తనకు మోటారుంది కనుక ఎక్కడికి వెళ్ళా ల్ననుకున్నాను. తనతోడి స్నేహితులువస్తే మర్యాదచేస్తుంది సాభిమానంగా. అందులోనూ అనేక విధాలగా. దేశంలో నేష నల్ మూమెంటు బాగావుందంటుంది. గాంధి నిజముగా మహా త్ముడని నమస్కారం చేస్తుంది. కాసేపు బెర్నార్డుషా మంచి కవీశ్వరుడంటుంది. మరి కొంచెంసేపు - ఎప్పుడూ లాడనులో వున్నట్లు-ఇంగ్లీషు ఫిల్ముల ముందర ఇండియను ఫిల్ములు దిగదుడుపు. సీతాదేవికూడా ఒకయాక్ట్రెసాఅని విమర్శిస్తుంది. అవి పేకుహోండ్లుకావు-అవి బీచిపయిరులుకావు - ఎక్కడలేని నవనాగరికత అంతా మూర్తీభవించింది సరోజకు.

౨

పరిశుద్ధమైన ఆత్మగల సనాతన హిందూయువతి
కీవర్తనము మంచిది కాదని చింతిస్తుండే వాడు రాఘవ
ప్రసాదు. వయసు ముదిరిన వాడగుటచే అలా అను కోటం
సహజమే కూడాను. పోనీ నీకిది మంచిదికాదు అని గట్టిగా
మందలించడాని కయినా తాను తండ్రియా లేక తమ్ముడా—
యింటిమేనేజరు మొదట్నుంచీ— అయితే మాత్రం అంత
స్వాతంత్ర్యము—కష్టంగదూ, ఉప్పూ, పులుసూ, తింటుండే
వాడు.

ఒక రోజు మధ్యాహ్నం రాఘవప్రసాదు పేర తంతి
వచ్చింది. చూడగానే సరోజను పిలిచి సంతోషవార్త చెప్పా
డు. సుధాకరుడు డాక్టరు పరీక్ష ప్యాసయినాడట. సాయంత్రం
స్టేషను దగ్గర కెళ్ళాలి. అని చెప్పేసరికి చిరునవ్వుతో లోపలికి
పరుగెత్తి కెళ్లింది సరేలే అంటూ. ఆరోజు-యిక యిది కాదని
అదీ—ఆ జాకెటు కాదని యీజాకెటు-కొంచెంసేపు యింగ్లీషు
ఫాషనులో పోదామా తెలుగు సంప్రదాయం లోనా—ఆలో
చించి ఆలోచించి, చివరికి లండను నుంచి వచ్చేవాడి దగ్గర
తెలుగు సంప్రదాయం ఏమిటి, అసందర్భంగా బెజవాడ కృష్ణ
వేషధారి లాగు ధరించినట్లుగా అని మంచి సిల్కు-ఫ్రాకు
వగైరా ధరించింది ఆంగ్లపద్ధతిన. సకాలానికి స్టేషను వద్ద
ఎదుర్కొని స్వాగత మిచ్చారు సరోజాప్రసాదులు. సరోజ
నిశ్చేష్టితురాలయింది సుధాకరుని ఖద్దరు బట్టలతో చూచే
సరికి. అభివాదములు ఆర్భాటములు అయింతర్వాత ముగ్గురు

మోటారులో సరోజ యింటికి బయలుదేరారు. సరోజ భావా లన్నీ సుధాకరుని చూడటంతోనే సరిపోయినాయి. ఖద్దరు లండను కూడా వచ్చిందా నీకోసం అన్నది మనసు పట్టలేక. పోనీ ఆ ఖద్దరులోనే సూట్లు ధరించటం లేదా-డాక్టరు వేమో అంది మరికొంచెం సేపటికి. సుధాకరుడు దేనికి జవాబివ్వలేదు. యింటి కెళ్ళారు. సరోజ మందిరం చూచే సరికి దిగ్భ్రమ చెం దాడు. తనతో ఒక్క స్కూలులో చదువుకున్న సరోజ-- చదువుకునే టప్పుడు యింత విచ్చలవిడి యేదీ. చదువు—చదు వుకు తగిన సంప్రదాయం—దాన్ని అనుసరించి స్వేచ్ఛ-యిన్ని మూర్తిభవించినవారెు యిప్పుడు. ఎక్కడ చూచినా పాశ్చాత్య పద్ధతులే. సర్వాలంకరణ శోభిత చిత్రపటాలే. ఒకప్రక్క దేవులపల్లివారి కృష్ణపక్షం. యెంకిపాటలు—పెరిడన్ డ్రామాలు, నవలలు, నాటకాలు—అంతా నాగరిక సారస్వత ప్రపంచం.

సరోజతండ్రి గిరిధరుడు బెంగుళూరులో గొప్ప ధన వంతుడు. తల్లిలేనిపిల్ల అని సరోజను అల్లారుముద్దుగా పెంచాడు. తనయావదాస్తిని సరోజపేరవ్రాసి ప్రేమవెల్లడించుకున్నాడు. అతని మరణానంతరంకూడా రాఘవప్రసాదే యింటివ్యవహార ములు చూస్తున్నాడు. సరోజకు ఉన్నతవిద్య చెప్పించలేదు, సనాతనాచారపరుడు గనుక. సరోజా సుధాకరులు సహపాఠ కులు. ఎడతెగని స్నేహం. సౌందర్య సంప్రదాయ వయో విశేషాలలో సమానులు. అనాథబాలుడగు సుధాకరుని గిరి

ధరుడు ఆదరించి అభిమానించకపోతే యింతవాడు కానేరడు. సరోజా సుధాకరుల నిష్కళంక ప్రణయాన్ని చూసి గిరీశం అన్నట్లు ట్రూలవ్ మారేజని సంతోషించాడు కాని కళ్ళారా చూడలేదు. సుధాకరుని మాటలు అమృతగుళికలుగా భావించేది. అతనిమూర్తి దివ్యంగాకనబడేది. క్లాసులో ఫస్టుమార్కు సుధాకరునకువస్తే "కర్కా-సుధాకరునిమార్కులునావి కలుపుకుంటే చెరినలభై వచ్చాయి" అనేది యింట్లో. అలాటి సుధాకరుడు వచ్చాడంటే సరోజ ప్రేమసముద్రం పొంగిపోయింది. ఆ సముద్రంలో అనేక విలాసాలు, వినోదాలు స్టీములాంచిలాగు ప్రయాణం చేస్తున్నాయి .యింతలోకి వెన్నెలవచ్చింది. రకరకాల పరిమళము సుధాకరునకు జోహారు చేసింది. ఉద్యాన విహారం వారలకు స్వాగతమిచ్చింది. ఒకచలవరాతి తిన్నెపై కూర్చుండి యిద్దరూ టీతాగారు. 'అద్దమేలంటాది అందాలు తెలుప' అన్నది సుధాకరుని విలాసంజూస్తూ.

లండను సిటీగార్డెనుల కంటే యిక్కడే బాగుంది.

నువ్వు ఖద్దరు బట్టలతో వస్తావని.

పరిస్థితులు ఆలోచించవుగదా - మహాత్ముని త్యాగమయినా గమనించి, దేశకల్యాణానికి తమ సర్వస్వమూ అర్పిస్తుండే మానధనుల వాక్యములయినా విని, చదువుకున్న వాళ్ళుం యింత ఖద్దరుగుడ్డ కట్టరాదా సరోజా—

ఇప్పుడు నువ్వు కట్టితే యిహ అంతటితో—అయినా నాకెందుకులే - ఖద్దరుధారణంలోని కష్టాలు నీకే తెలుస్తాయి మున్ముందు.

3

మర్నాడు పదిగంటలకు భోజనంచేసి సరోజ యింటికొచ్చాడు. లోపలికి తొంగిచూశాడు. చిత్రపటం గీస్తుంది సరోజ. చప్పుడు గాకుండా నడుస్తూ సరోజవెనక నిలిచాడు. చిన్నఫోటోను ఎన్‌లార్జిచేస్తుంది. సుధాకరుడు తన ఫోటో వ్రాయటంలోగల సరోజ ప్రేమకు సంతోషించాడు హృదయంలో. తనకుర్చీపై చేతులుంచి నిలుచున్న సుధాకరుని చూడకుండా మరోరంగుకోసం లేచి వెనక్కి తిరిగేటప్పటికి సుధాకరుని కౌగిట్లో పడింది. అలాటి కౌగిళ్ళు ప్రకృతిఅమ్మకు పెరుగన్నంతో సమానం. ఆమె ఆరాధకులకు స్వభావవిహారం కంటే అనుకరణంమెండు. యీఅప్రయత్న – అసాధారణ– అపూర్వ-అలభ్య ఆలింగనానికి అర్థమేమిటో. స్తంభీభూతులైనారిరువురు. నోటమాటలేదు. ఒక్కసారిగా నవ్వుకొన్నారు యిర్వురు. ఇదేమన్నా క్షణమాత్ర కృత్రిమాలింగనమా స్త్రీ వేషధారులవలె?

ఉం! అన్నది చిరునవ్వుతో.

ఆఁ! అన్నాడు హృద్వేగంతో.

ఆ బొమ్మమీద ముసుగువేసింది. యిద్దరూ కూర్చొని అనేకవిషయాలు ముచ్చటించుకున్నారు. విదేశీయ నాగరికతా విశేషము విమర్శించాడు. నూతనముగా దిగుమతి అవుతున్న దిగంబర సంఘాలను తూలనాడాడు. కార్యదీక్ష గణనీయమన్నాడు. ఇంతలోకి నాలుగయింది.

ఇవాళ కృష్ణకాంతుని టెన్నిస్ పందెములు చూడ పోదామా?

ఎవరూ—కృష్ణకాంతుడా - అన్నట్లు బి. ఎ- అయినాడు.

యిద్దరూ మోటారెక్కి వెళ్ళారు. ఆరోజున కృష్ణుడు ఆటకు నిలిచేసరికి అమోఘమైన ఆదరణజూపారు ప్రేక్షకులు.

దొరలు నేర్చుకొన్నా రీతనిదగ్గర అనేకమర్మాలు - అన్నది, సరోజకు టెన్నిసంటే చాలాసరదా. కాఫీ, టెన్నిసు అనే రెండువస్తువులుంటే నిద్రాహారాలకు కొంతవిశ్రాంతి యిస్తుంది.

కృష్ణకాంతుని ప్రత్యర్థిబృందమువారిలో నొకడు రాలే దని చిందులుతొక్కుతున్నారు. న్యాయాన్యాయ విమర్శకుడు తొందరపెట్టుచున్నాడు. సుధాకరుని వచ్చి బలవంతం చేసారు, కృష్ణకాంతునకు ప్రత్యర్థిగా ఆడమని. యితర పెద్ద లందరూ కోరారు. సరోజ ఆతని నెమ్మదిగా ముందుకు సాగ నంపింది. కృష్ణా సుధాకరులు చిరకాల స్నేహితులు. ఆతడు కష్టపడును. యీతడు యుక్తి పన్నును. కరస్పర్శనం చేసు కున్నారు. యిద్దరికీ 'బ్రేవో' చెప్పింది సరోజ. కృష్ణకాంతుడు తనకు యిష్టుడూ, విశేషించి అనుభవశాలి. సుధాకరుడు తనకు కాబోయేభర్త. ఎవరు ఓడినా విచారమే. సరే ఆట ఎంతకాలమాడినా జయాపజయాలు నిర్ధారణ కాలేదు. ఇద్దరినీ సత్కరించారా యజమానులు. కృష్ణకాంతుని పిలిచింది

సరోజ. యిద్దరూ సహాధ్యాయు లైననూ సుధాకరు డంత చనువు లేదు.

అభివందనాలు—అపజయం రానందుకు అన్నది.

టక్కరివి—అన్నాడు కృష్ణుడు.

ఆతని మనస్సు చివుక్కు మన్నది. వారిద్దరూ వెళ్ళారు. అపజయం అనుకొనని మాట యితనికి. ఇంతటి ఆటగాడా సుధాకరుడు అనుకున్నాడు. ఆశ్చర్యం వెంట అసూయ పరుగెత్తింది. ప్రెసిడెన్సీ ఛాంపియన నే గర్వం మూర్తీభవించింది. సరోజ మీద ఒక కన్నుగల కృష్ణకాంతునకు ఆ సరోజ మాటలు కొంత సేపటికి తృప్తి కలుగజేశాయి.

అనుదినం సినిమాప్రదర్శనాలు—నాటక వీక్షణాలు—నవ్యగానములు—సంతోషంతో కాలంగడుస్తున్నది.

మాబావకు మార్మగోవా ట్రాన్స్ఫరయింది అన్నాడు ఒకరోజున.

అయితే ?

పోవాలసివస్తుందేమో.

ప్రాక్టీసు ?

మాటాడ లేదు సుధాకరుడు.

కళ్ళనీళ్ళు పెట్టుకుంది సరోజ.

పోతావా-సుధాకర్.

వద్దంటావా-సరోజా.

యిక్కడ ప్రాక్టీసు పెట్టుకోరాదూ?

సహాయులు ?

దేవుడు-తర్వాత నేను-చాలరా?

అయితే నీయిష్టం.

౪

నెల తరువరి. సుధాకరుడు సరోజయింట్లోనే బస. పెద్దబజారులో నొకమేడపై డాక్టరు సుధాకర్ అనేబల్ల పెద్దక్షరాలతో వ్రేలాడగట్టబడింది. సామగ్రిఅంతా పెట్టుబడి సరోజది. ఒకరోజున పట్నంవచ్చి తిరిగీ యింటికెళ్ళేసరికి తలుపు వేసివుంది. తలుపు తెరిచాడు.

గెట్ ఎవే యూ రాస్కెల్ అంది.

నేను-

ఎనఫ్ ఆఫ్ యువర్ స్టుపిడిటీ-అన్నది గట్టిగా.

సరోజా అని పెద్దగా కేకవేశాడు సుధాకరుడు.

కాఫీ-అయ్యో అని కళ్ళుమూసుకుంది.

నాగులూ-అని పిలిచాడు.

వాడు వంటనౌకరు. అలా చనవుగా పిలవవద్దని చాలా సార్లు యుద్ధాలయినాయి. యిల్లంతా వెదికాడు. ఎవరూ లేరు. రాఘవప్రసాదు పునహా వెళ్ళాడు.

నౌకర్లేరీ సరోజా ?

తిరుగుబాటు చేశారు.

ఎంచేత ?

రాత్రి కృష్ణకాంతు, నేనూ సినిమానుంచి తిరిగి వచ్చిం తరువాత చెస్సు ఆడుకుంటూ టీ కావాలన్నాను. 'మావల్ల కాదమ్మా-రాత్రింబగళ్ళు పని చేస్తామా-మాలెఖ ఫయిసలు చేయ' మన్నారు. ఉదయం ఎవళ్ళడబ్బు వాళ్ళకిచ్చి పంపే శాను.

అర్ధరాత్రి టీ యేమిటి మరి ?

నౌకరు యిష్టమా అది?

బాగావుంది వరస. వెనకటికి ఎవడో ఒకతాశిల్దారు బంట్రోతును పిలిచి పిల్ల లెంతమందని అడిగాడట. ఎప్పు డూ మీ దగ్గరేవుంటే పిల్ల లేమిటండి అని జవా బిచ్చాడట. అలావుంది. పోనీ నీకంత యిష్టమయితే-

నేను కాచుకోవాలా మరి?

అవును. నా క్కా-వాలి యిప్పుడు.

వంటచెయటానికి నేను చదువుకొన్న సరోజను. నాగు లునుకాను.

అయితే యింటిపనులు మానేయాలా సరోజా ?

అక్షరాలా-చదువుకొన్నదానికి యింటిపనులకు పోలీ సుకు దొంగలకున్నంత స్నేహం.

ఏంచేద్దాం?

రెస్టారెంటుకు.

ఆరోజుకు యిద్దరూసేవించి సుధాకరుడు ఆసుపత్రి కెళ్ళాడు. రెండుగంటలకి యింటికివచ్చి చూచేసరికి సరోజ

నిద్రపోతున్నది. ఎలక్ట్రికుపంకా వదిలాడు; మెలకువ వచ్చింది సరోజకు.

ఆకలి వేయకుండా మందేమైనా వుందా?
భోజనం చేయలేదా మరి?
నిన్ను వొదిలా భోజనం.
ఇంట్లో దానికి నాకేం- ఆసుపత్రి ?
మానేశాను.
నీవూ డాక్టరుగిరీశం సామెతకి వచ్చావు. లే హోటలుకి.
నీవు ... ... యింతకు ...

నాచేతకాదు. అయినా అభిమానం విసర్జించి నేను నడవను. చస్తే చస్తానుగాని.

విశేషంగా మాట్లాడక సుధాకరుడు వంటశాలకు వెళ్లి పూరీలు తయారుచేశాడు, తన ఆకలికొద్దిన్నీ, అంతకంటె బాధాకరమైనప్రియ సరోజ ఆకలికొద్దిన్నీ. నిష్కళంక ప్రేమ అంటె అదే. అదే అనుకూల దాంపత్యం. ఆత్మా నాత్మైక్యం. శిరీషకుసుమకోమలం. అదిలేనిది అధఃపతనమాజన్మాంతం. నాయికా, నాయకులకు భావభేదం కలుగరాదు, యిప్పటి కిరాయి నటీనటులవలె. టేబిలువేశాడు. సరోజా అన్నాదు ప్రేమపూరిత వాక్కుతో-

ఛ—ఏమిటిది. చదువుకున్న వాళ్ళ లక్షణం కాదు అన్నది.

ఎంత చదువుకుంటేనేం మన పోషణలో అభిమానం ఏమిటి ?

వెండిగిన్నెలు కడిగి లోపల పెట్టటం నీవంతు.

నేనేం దాసీనిగాను. యింగ్లండులో ఎవర్నయినా చూశావా-అని ఛట్టున వెళ్ళిపోయింది.

మంచం దగ్గరికెళ్లి నిలబడి వాళ్ళ ఆచారాలు మనకి అనుసరణీయయోగ్యమయినవే ఆచరించాలి అని అన్నాడు.

యివాళ కృష్ణకాంతుడు సినిమాస్టూడియోకు ఆహ్వానించాడు వార్షికోత్సవ సందర్భాన. పోదామా?

అవశ్యంగా-నువ్వు గౌను వేసుకోనంటే—

మామూలు రేషన్ ఏం? మరి నువ్వు సూటు ?

నేనూ ధరించను.

త్వరలో వస్త్రములు ధరించి మెట్లు దిగుతున్నారు. టెలిఫోను గంట వినబడ్డది. సరోజ పరుగెత్తి కెళ్ళింది. టెలిఫోనులో మాట్లాడుతూ 'ఆ! డాక్టరుగారా? లేరండీ' అని చెప్పింది.

అహ-ఏమిటది? (టెలిఫోనుదగ్గరకువెళ్ళి) ఆ-ఏమండీ! నేనా-యిప్పుడే-సరే-అన్నాడు.

చనిపోవటానికి సిద్ధమయ్యేంటే— నేనురాను- అక్కడ నుంచిపోదాం-నువ్వుకూడారా-

డాక్టరుపరీక్ష చదవటం నాకర్మమే—

అని నిట్టూర్పు విడిచింది.

ఎప్పుడు టెన్నిసుకు రమ్మన్నా రావు. సినిమాకు రావు. ఎంతమంది వస్తారు. ఎంతగౌరవం వస్తుంది.

నా అభివందనాలు కూడా నువు చెప్పు.

అని బండియెక్కి వెళ్ళిపోయాడు.

ఒంటరిగానే సరోజ వెళ్ళింది.

✂

ఆ నాటి ఆనటీనటులవర్తనము-వారలసల్లాపములు-అవన్నీ ఆశ్చర్యం కలుగ జేసినవి సరోజకు. కృష్ణారావుకు ఆ రోజున అందరూ చూపిన ప్రోత్సాహము. కృష్ణరావు సహాధ్యాయి. గొప్ప టెన్నిసు ఆటగాడు. విద్యాధికుడు. సినిమా నటుడు. ఇదంతా సరోజకు అదోవిధమైన ఆనందంకలుగజేసినది. తాను సినిమానటి అయితే పెద్దనాట్యకత్తెలందరూ దిగదుడుపుకాదా అనుకుంది ఒక్కసారి. సుధాకరుడు వట్టి సనాతనపరుడు. కళ్ళుమూసుకుంది. కృష్ణరావు ప్రతిమ కనబడుతుంది హృదయసీమలో. "ఈ ద్వైధీ భావము మారుటెట్లు? ఇది సంప్రదాయ విచ్ఛేదకారకము" అనుకున్నది. ఎన్ని యిలాటివి జరుగలేదు అని సమాధానం చెప్పుతున్నది. నైదోడే సరసిజాక్షి - స్వస్వము సుధాకరుడు - కృష్ణుడు - ఎవరు? ఎవరో? ఏమిచేస్తుంది-ఎలా జరుగుతుందో అధఃపతనమో-అత్యంత సౌఖ్యమో - అదేనిశ్చయించాలి - ఆరోజుతీరది- ఎప్పుడూ యిలావుందా? ఇంటికొచ్చింది. మనసు

పరిపరివిధాల ఆందోళిత మయినది. ఇంతలో సుధాకరుడూ వచ్చాడు.

సినిమా ఎలావుంది ?

నన్ను మాట్లాడించకు - యిప్పటికి

ఉదయం మార్నిగోవా వెళ్ళుతున్నాను.

సరే.

సరే సుధాకరుడు వెళ్ళాడు. రాత్రి నిద్ర లేదు. ఆమె మనస్సు పాడయినది. ఆమెకేమిటి? ఎంతమందికి అలాపాడవ లేదు? అందుకనే బ్రహ్మచర్యంఅంటే కేవలం సంగమమేకాదు మనసు చలింపజేసే దృశ్యాలు, శృంగార కధనములు-గోచ గింపకూడదన్నాడు మహాత్ముడు.

ఆరోజు ఉదయం కృష్ణరావు, సరోజ టెన్నిసు ఆడు కున్నారు.

మధ్యాహ్నం మాస్టూడియోకు వస్తావా ఒకసారి ?

ఓ- తప్పకుండాను పోయేటప్పుడు అలాఒకసారిరా.

కృష్ణరావుకు ఎలాగయినా సరోజను సినిమానటన మున కలవాటుచేస్తే ఆమెవల్ల పేరు ప్రతిష్ఠ ధనం సౌఖ్యం అన్నీ సమకూరుతవి. సుధాకరుడు వూళ్ళో లేడని కృష్ణరావుకు తెలియకపోలేదు. ఇదే సమయమని ఆహ్వానించాడు సరోజను.

సరిగాపదిగంటలకు స్టూడియోకు వెళ్ళింది కృష్ణరా వుతో. యజమాని కృష్ణరావొక కొత్తనట్టురాలను తీసుకొస్తు న్నాడని తలంచి ఆమెకు అమితమైన ఆదరణ చూపాడు.

అమెచూరు నటకుల కున్నంత నాట్యకౌశల్యం ప్రొఫె షనల్సు కుంటుందా? ఉత్తమాదర్శాలు- భావాలు వెలిబుచ్చ టానికి ఉత్తమవిద్య కావాలి అన్నాడు కృష్ణరావు, మాటసం దర్భమున. యింటికితిరిగివచ్చింది. ఆమెమనస్సు సాంతం మారి పోయింది. సినిమానటనమే ఆనందధామం. అదేజన్మసాఫల్యం అనుకుంది. అసలుకళలో లోపంఏముంది. కళోపాసనకు అం దరూ సమానులే, ఆచరణలో భేదంవుంటుందికాని. అమె చూరు అయితే అసలు అమర్యాద మాట అనకూడదు. కృష్ణుడు సుధాకరుడు తూచింది ఆమెహృదయంలో. వడ్లగిం జంత కృష్ణరావు వైపు మొగ్గింది. నవలలు నాటకాలు సిని మాలు ఆటలు పాటలు విచ్చలవిడి ఊరికేపోవునా మరి. నిశ్చలమైన మనస్సు లేకపోతే జీవితానికి పెద్దమచ్చకాదా?కాని మంచిచెడ్డలు చెప్పటానికి రాఘవప్రసాదులేడు; సుధాకరుడు లేడు.

టెన్నిసు ఆటలతోనూ సినిమాస్టూడియో అనుదిన సందర్శనాలతోనూ వారం గడచింది. అచ్చట సినిమా నాట్య కత్తెలందరితోనూ పరిచయం కలిగిందామెకు.

విద్యాధికులే రావాలి సినీమానటనమునకు అన్నది లీల.

అందుచే మీవలన యీవృత్తికి గౌరవం ఆపాదిత మౌను అన్నది మరో మాధురి.

అభినయ కౌశల్యం తమరూపాన్ని పోటీ చేస్తుంది అని అన్నాడు మేనేజరు.

మరునాడు సుధాకరుడు పదిగంటలకు యింటికి వచ్చేసరికి సరోజ త్వరపడుతున్నది.

ఎక్కడికి?

స్టూడియోకు-

స్టూడియో - అంటే?

నేను మిస్. సరోజను - సినిమానటిని.

ఎప్పటి నుంచి?

వారం రోజుల నుంచి.

తెల్లబోయాడు సుధాకరుడు. పేరు ప్రతిష్ఠలు రావటానికి సినిమా నటనమేనా అవసరం? ఎండలో బజారులో నలుగురి ముందర తెయితెక్కలాడుట తెలివి తక్కువ తనము గాదా. చివరకి పిచ్చిదానవై పోయినావు సరోజా.

అప్పుడే గోడలమీద పెద్ద కాగితములు అంటించుచున్నారు. రాజోవృధిలిం. "మోహిని" "మిస్. సరోజ కథానాయిక" అనిచదివే ప్రతివాళ్ళూ ముక్కున వేలు పెట్టుకొని ఆశ్చర్యపడ్డారు.

రాఘవప్రసాదుకు విచారం, కోపం. కాని లాభం లేదు. చదువు చెప్పించటం సంప్రదాయం చంపివేయటానికి అని అన్నాడు సుధాకరునితో.

చెడుత్రోవ త్రొక్కింది సరోజ.

పెళ్ళిచేస్తాను-ఏమంటావు సుధాకర్? ఇక ఆలసించను.

నే నేమనను-యీకృష్ణరావు వట్టి దుర్మార్గుడు.

సుధాకర్-బాపూజీ - అతన్నేమయినా అన్నారంటే నేను సహించను.

ప్రసాదు లోపలికి వెళ్ళాడు.

౬

నాలుగు మాసముల తరువాత. సుధాకరుడు ప్రత్యేక బంగాళాలో ప్రాక్టీసు చేస్తున్నాడు. రోజూ సరోజ యింటికి వస్తూ పోతున్నాడు. శుభలేఖ చూపింది సుధాకరునకు.

సరోజా-ఇదియేమి యీ వివాహానందం?

అవును.

మన ప్రేమ సుమమాలను త్రెంచవద్దు సరోజా.

అది ఎరుగక పోలేదు సుధాకరా.

అయిన బ్రహ్మచర్యమే నిశ్చయించావా యీజీవికి—

దైవఘటన మది.

అనుభవం చాలదు.

అంతర్వాణి ప్రబోధం అది.

అంతియేనా?

ఆc.

ఇక బలవంతముచేయను. నీయిష్టమేనాయిష్టము. కాని చిన్ననాటి స్నేహభావముంచు. నీహృదయాన ఈసుధాకరునకు స్థానముకలదని తలంచు.

సరోజ కళ్ళనిండా నీళ్ళు. గుభాలున మంచంమీద కూలింది. లేచేసరికి సుధాకరుడు విసరుతున్నాడు.

సుధాకర్! ఇది పిన్నాటగాదు. నామనస్సు కృష్ణరావు వైపు పరుగెత్తుతున్నది. నీస్నేహధర్మం చూపాలి. అందులో ఔదార్యం మేళవించాలి. మాప్రణయానికి స్వాగతోపన్యాసం చెప్పాలినీవు. నాకిది జీవితసంధ్య - ఆనందధామమో - అధఃపతనమో - హృదయపూర్వకంగా, సరోజా - ఊఁ, అనాలి. మాప్రేమ సౌధానికి పునాది పెట్టాలి.

మనస్ఫూర్తిగా మీవివాహం నాకంగీకారమే దైవ సాక్షి. దైవముమీకు తోడగుగాక అన్నాడు మనసు నిస్పృహ చేసుకుని.

అలాగే ఆశీర్వదించాడు వివాహసమయంలో.

2

రేండేండ్లు గడచినవి. కృష్ణరావు క్రమంగా దుర్వ్యసనాలకు పాల్పడ్డాడు. రిఫ్రెషుమెంటు రూములు, పార్శీయువతుల సంపర్కములు మొదలగువాటిలో ఆరితేరాడు. జూదరుల సాంగత్యం సరోజను క్రమంగా మరపించింది. వేలకొలది పన్నులా జూదపురాణి పరిపాలనలో పాంపెయిను దివాను. పణ్యస్త్రీ బాహుబంధాలు పరివారము. ఎవరిమీదికి దండెత్తినా జయమేలభించాలి. రోజురోజుకు బిల్లులెక్కువయినాయి. అతన్ని బాధిస్తుంటే సరోజయిస్తుండేది కొంతడబ్బు. క్రమంగా సరోజ వస్తువులన్నీ పాంపెయినుబుడ్లకు సరిపోయినవి. సరోజ ఆస్తి విడుదలకాలేదు. ఒకరోజున పస్తుండాలసివచ్చింది.

ఇలాచేస్తే బ్రదుకుట దుర్లభం అన్నది నిరాశచే.

దుర్లభమయితే చావమన్నాడు కటువుగా.

కాసేపటికి యింటినుంచి వెళ్ళిపోయింది. సరాసరి సుధాకరుని ఆసుపత్రికి వెళ్ళింది. సుధాకరుడు పండరీపురం వెళ్ళాడు. వస్తేయిమ్మని ఒక జాబు యిచ్చింది నౌకరుకు. యింటికివచ్చి పడుకుంది. కృష్ణరావు వచ్చాడు యింతలోకి.

క్లబ్బుకి యిచ్చాను బిందెలమ్మి. ఇదిగో యీఅణాపెట్టి ఏదైనా బజారులో కొనుక్కో.

ఉద్యోగము చేయవా యిక ?

చేయను.

నాజీవితం యిలా ధ్వంసంచేయుటం న్యాయమా నీకు?

ఒకరు చేసేదేమిటి-చేసుకున్నావు.

అవునురా దుర్మార్గుడా

అని ఒడిలోని పిస్తోలుతీసి కృష్ణరావును కాల్చేసింది. ఆపిస్తోలే సరోజ జీవితాన్ని మాయంచేసింది.

౧

మరునాటి వార్తా పత్రికలో

"మిస్. సరోజా ఆత్మహత్య"

అని పెద్దక్షరాలతో ప్రథమపుటలో చూచేసరికి సుధాకరుడు మూర్ఛపోయాడు.

కాని ఆతని బ్రహ్మచర్యమున కంతులేదుకదా-పాపం సరోజ ఎంతచదువుకుంటేనేం.



స్థాపితము 1918 సం॥రం.

# Cow Protection Society, Ellore.

# ఏలూరు

# గోసంరక్షణసమితి.

ఇందు అనాథగోవులు రక్షించబడుచున్నవి. విశేషముగా రక్షింపవలెనంటే ప్రకటన పత్రికలు, ఉపన్యాసములు చేయవలసి వున్నది. అందుకు ద్రవ్యము ముఖ్యావసరము. ఉదారవంతులు వెంటనే చందాదారులుగాచేరి తమ ధర్మమును లోకమునకు వెల్లడించవలసియున్నది. మిగతావారు శక్తికొలది సహాయముజేసి విరివిగా ప్రాణులను రక్షించి యిహపరకీర్తులు పొందుదురుగాకయని కోరుచున్నాము. గడ్డి నగయిరాలు కొంత సహాయము చేయవలెను. బీడుభూములు కావలసియున్నవి. ధర్మములకు రశీదులు యివ్వబడును. శాశ్వతనిధి ధర్మములకు రశీదు పట్టాలు యివ్వబడును.

ఇతర వివరములు 

రావుబహదూరు మోతే గంగరాజు
జమీందారు, ప్రెసిడెంటు.
మద్దుల వెంకటచినరాజు, వైస్ ప్రెసిడెంటు.
పోలిశెట్టి గోపాలస్వామి, సెక్రటరీ

---

దయచేసి హిందూయువజనసంఘ అన్నదాన సమాజముల ప్రకటనలు ఈబుక్కు టైటిల్ 2, 4 పుటలలో చూడుడు.

# Y. M. H. A., Ellore.

## హిందూ యువజన సంఘము, ఏలూరు.

ఈ గ్రంథాలయము 1904 సం॥రం స్థాపించబడెను. 1918 సం॥రం సంఘము రిజిష్టరు అయినది. 1928 సం॥రము మ॥ రా॥ శ్రీ రా॥ బ॥ మోతే గంగరాజు జమీందారుగారి ద్రవ్యసహాయమున నూతన దివ్యభవనము (రు 50000 లు వెచ్చింపబడి) నిర్మింపబడినది. ఇందు దిన, వార, పక్ష, మాస పత్రికలు, ఆంగ్ల, ఆంధ్ర భాషలయందు షుమారు 60 వచ్చుచున్నవి. ఆంగ్ల, ఆంధ్ర, సంస్కృత గ్రంథములు షుమారు 10 వేలవరకు గలవు. ఇంకను గ్రంథములు, పత్రికలు తెప్పించవలసియున్నది. యెలక్ట్రిసిటీ, రేడియో, అవసరము. మ్యాజిక్ లాంతరు ఉపన్యాసములు యిప్పించవలసియున్నది. ప్రతి సంవత్సరము ఆదాయమునకు మించిన వ్యయమగుచున్నది. గాన ఎల్లరు శక్తికొలది సహాయపడుడు. ధర్మములకు రశీదులును, శాశ్వతధర్మములకు రశీదులతోపాటు పట్టాలునుయివ్వబడును.

ఇతర వివరములకు :—

(1) రావుబహద్దరు, మోతే గంగరాజు జమీందారుగారు,
(ధర్మకర్తృ సభాధ్యక్షులు.)

(2) మద్దుల వెంకట చినరాజు శ్రేష్ఠిగారు,
(ధర్మకర్తృసభా గౌరవ కార్యదర్శి.)

---

☞ దయచేసి అన్నదాన సమాజము, గోసంరక్షణసమితి ప్రకటనలు ఈబుక్కు టైటిల్ 2, 3 పుటలలో చూడుడు.